శ్రీ ర స్తు.

ఇదిభరతశాస్త్రంబు నభ్యసింపఁగోరెడు యెల్లవారలకు
నత్యంతోపయుక్తంబగునటుల, మృదుమధురవాక్యసమేతంబుగా
కోహాళ, అర్జున, నారదాది, భరతశాస్త్రంబుల బరిశీలించి,
రాజమహేంద్ర పురనివాసులగు

బ్రహ్మశ్రీ వేదుల సీతారామ శాస్త్రిలవారిచే

రచియింపబడిన

# భరతసంగ్రహము

తదుక్తభావదర్పణ టీకాసమేతంబుగా

లేఖప్రమాద దోషరాహిత్యంబుగా

రాజమండ్రి

శ్రీకళానికేతన ముద్రాక్షరశాలయందు

మొదటికూర్పు 1000 ప్రతులు

ముద్రించి ప్రచురింపఁబడినది.

దీనివెల రు 1-4-0

1908

# విషయసూచిక.

1 భావాధ్యాయము--యిందుశాస్త్రోపనయనము, అభినయలక్షణము, సభాలక్షణము, పాత్రలక్షణము, నటనలక్షణము, సభానాయకలక్షణము, శిరోభేదములు, నేత్రభేదములు, గ్రీవాభేదములు, హస్తద్వాదశప్రాణములు, అసంయుతహస్తములు, సంయుతహస్తములు, ప్రస్తారహస్తములు, నష్టోద్దిష్టములు, యితరహస్తములు వాటికి స్థాననిరూపణములు మొదలుగాగల అనేకవిషయములు స్పష్టముగా వ్రాయబడియున్నవి.

2 రసప్రకరణము—యిందు నాయికానాయక లక్షణములు, వాటి భేదములు, శృంగారాదిరస భేదములు, ద్వాదశావస్థలు, సంచారీభావములు, ఆలంబనములు, తటస్థములు, వుద్దీపనములు, రసాభాసలు, భావోదయము, భావసంధి, భావశబలత మొదలగు పెక్కువిషయములు వ్రాయబడినవి.

3 రాగప్రకరణము—నాదోత్పత్తి, శృతిభేదంబులు, 72 మేళకర్తలు ప్రస్తారమేరువులు, జన్యరాగములు మొదలగు విషయంబులుగలవు

4 తాళప్రకరణము— యిందుతాళోత్పత్తియు, దశప్రాణవివరణంబును, ప్రస్తారమేరువులు, మార్గతాళములు, దేశీతాళములు నైనముగావిశేషించి వ్రాయబడియున్నవి.

5 పాదప్రకరణము—సమవక్రపాదాదిభేదంబులు, తాండవాదిభేదంబులు, పంచప్రాణంబులు, కర్మత్రితయంబును, కళాపంచకము, న్యాసత్రయము గమనపంచకమును, మండలభేదములు మొదలగునవి వ్రాయబడినవి.

## భరతసంగ్రహము.

| వెల | | రూ. అ. పై. |
|---|---|---|
| క్యాలికో | బైండ్ | 1—4—0 |
| మార్బిల్ | డిటో | 1—2—0 |
| సాదా | డిటో | 1—0—0 |

## శిల్పసంగ్రహము.

ఇండుగృహములు దేవాలయములు గోపురములు మొదలైనవి కట్టుకొనుటకు ఆయములు శంఖుస్థాపనములు, 128 విమానములకు వేదికలమానములు స్త్రీ, పురుష నపుంసక భేదంబులు కోలతలురూపధ్యానంబులు వుపదేవతలు మొదలగు విషయంబులెల్లను భరద్వాజ సంహితనుంచి సంగ్రహముగా తెనుగుటీకతో వ్రాయబడినది—దీనివెల రూ0-6-0ఆరుఅణాలు.

భరతసంగ్రహమును. శిల్పిసంగ్రహమును. కావలయువారు వేదులసీతారామశాస్త్రిల వారికి వ్రాసిపొందవచ్చును

రాజమండ్రి
హైరోడు, నెం415రు గృహం.



శ్రీరాములు

శ్రీశారదాంబాయైనమః

# భరతసంగ్రహము.



సీ॥ శ్రీగిరిజాధీశ శ్రితహృదాబ్జ్యాదినేశ
భవహరకీనాశ భయవినాశ
గోరాజఘనవాహ క్రూరారిసవదాహ
నగరాజగేహాయార్యార్ధదేహ
భవమదోద్ధతిభంగ భస్మవిలిప్తాంగ
బాహూధృతకురంగ భరితగంగ, 1A
మురనైరిశస్త్రసన్మునిజనస్తుతిపాత్ర
ఫాలాగ్ని నేత్రపావనచరిత్ర

గీ॥ బాలమునిపాలలీలాక పాలమాల
విధృతవరశూలదాన వాభీలహేల,
హాలవిచిత్రితగళవ్యాళ హారనిగమ
పాలత్రిభువనపూజిత పాదసాంబా॥

తా॥ శోభాయమానంబగు పార్వతీదేవికి పెనిమిటి అయినటువంటిన్ని భక్తులహృదయపద్మములకు సూర్యునివంటిన్ని జన్మరాహిత్యము జేయునట్టిన్ని యమునియొక్క భయమునునశింప జేయునట్టిన్ని వృషభవాహనము గలుగు నట్టిన్ని క్రూరశత్రుడగు దక్షప్రజాపతియజ్ఞమునుదహించునట్టిన్ని శ్రీశైలపర్వతముగృహముగాగలుగునట్టిన్ని వుమార్థధారుడైనటువంటిన్ని మదనగర్వా

పహారుడై నటువంటిన్ని భూతిచే బూయబడు దేహముగలుగు నట్టిన్ని చేతి యందు ధరించిన లేడి గలిగినటువంటిన్ని గంగనుదరించునట్టిన్ని విష్ణువు బాణముగా గలిగినటువంటిన్ని నుదుటియందు యగ్ని నేత్రముగా గలిగినటువంటిన్ని మునికుమారుడైన మార్కండేయుని రక్షించినట్టిన్ని విలాసార్థముగా ధరించిన పునుకమాలికలు గలుగునట్టిన్ని త్రిశూలము ధరించునట్టిన్ని రాక్షసులకుఅగ్ని వంటిన్ని గరళముచే చిహ్నముగల కంఠము గలిగినటువంటిన్ని నాగాభరణములు గలిగినటువంటిన్ని వేదపాలనముగావించునట్టిన్ని ముల్లోకములచేత పూజింపబడునట్టి పాదములుగలిగినట్టి హేసాంబా॥

సీ॥ ప్రమథగణంబుల బ్రణుతియొనర్చియు
భారతీసతినిభావమున నెంచి
సత్కవిప్రవరుల సంస్మరించిమదీయ
గురుయుగ్మమునకు గేల్గూర్చి మోడ్చి
భరతశాస్త్రజ్ఞుల భావమందుభజించి
కులదైవతంబుల గూర్మి నెంచి
నిగమాగమజ్ఞుల నిపుణతనగ్గించి
తత్వదర్శనులను దాల్మి నెంచి
గీ॥ కర్త భర్త హర్తవై కరముమించు
నీకు నంకితమగునట్లు నిరతభక్తి
నీసశతకంబు జెప్పెద జిత్తగింపు
మకుటధృతచంద్ర సర్వోత్తమాంగ సాంబా॥ 2

తా. ప్రమథగణములకు నమస్కరించి సరస్వతిని మనస్సున తలంచి కవిశ్రేష్టులస్మరించి గురువులకుగేలోడ్చి భరతశాస్త్రప్రవీణుల

భావములను నెంచి కులదైవముల క్షేమతో నమస్కరించి నిగమాగమ వేత్తల గొనియాడి సాధులగొల్చి యీలోకముల బుట్టించునట్టియు బోషించునట్టియు సంహారించునట్టియు నీకు సంకీతముగా నీస శతకంబు చేయుచున్నాను చిత్తగింపవలయును కిరీటమందు ధరించుచంద్రుడుగల శిరస్సుగలుగు హేసాంబా॥

సీ. శ్రీకరంబగుచు నాస్త్రితజనాధారమై
 జెన్నొందు రాజరాజేంద్రపురము
అందు వేములనాను కాస్యయసోముండు
 యజ్ఞేశ్వరాంహ్వయు కెలమి కెలయు
తత్సుతుండు గిధరసస్త్రరు సీతారాము
 డయాఖ్యుడం తేవాను లలరగొలువ
భరతశాస్త్రార్థముల్బరిసీలనము జేసి
 బాలబోధార్థమైబరగుసరిగల

గీ. భావరసరాగతాళాను భరత భరత
సంగ్రహము జేసి మీకునొసంగి భక్తి
జేరి జేకొని బ్రోవంగ జెల్లుసుమ్ము
శైలతనయార్థబింబ శ్రీ శైలసాంబ॥ 3

తా. సకలశోభాయమానంబై సర్వజనాశ్రయముగా బ్రకాశించు రాజమహేంద్రవరమునందు వేదులయజ్ఞేశ్వరాహ్వయుని కుమారుండగు సీతారామ శాస్త్రిశిష్యులు బార్థించుటచేత భరత శాస్త్రార్థంబులు బాలులకు బోధ జేయదలంచి భావరసరాగ తాళములతో బ్రకాశించు నీభరత సంగ్రహము జేసిమీకు సమర్పణ చేసెను దీన్నిగ్రహించిదయతో రక్షింపవలయును అర్ధనారీశ్వర రూపుడగు శ్రీశైలనివాసుడగు హేసాంబా॥

సీ. నృత్తంబునాట్యంబు నృత్యమ్మునంగను
నలరుముత్తెరగుల నవనియందు
రసభావములు లేక రాగతాళములతో
రంజిలనృత్తమై రమ్యమగను
నాటకంబులపూర్వ నవకథాయుతమైన
నదియునాట్యంబని రవనిబుధులు
రసభావతాళరా గసమన్వితంబైన
నృత్యంబటంచు నెన్నికవహించు

గీ. నదియు రెండు దెరంగుల నతిశయిల్లు
నగునులాశ్యంబు గూర్చుండినభినయింప
నిలిచినటియింప నటనమౌనిందునృత్త
లాస్యములుజూడ పర్వములగునుసాంబ

తా. నృత్తము నాట్యము నృత్యము అనిమూడువిధములై యుండును రసభావరహితమై రాగతాళయుతంబగునది నృత్తంబనంబడును నాటకంబులయందు పూర్వమందైనదిగాని నూతనమైనదిగాని కథానమ్యంబు గలిగియుండిన నాట్యంబనంబడును రసము భావము రాగము తాళము గలిగియుండి ప్రకాశించునదినృత్యంబనంబడును ఆనృత్యము మరియు రెండువిధంబులై యుండును గూర్చునిసుఖతరముగా నభినయించునదిలాస్యంబనియునుతాళానువర్తిగానిలిచినటు పాద విన్యాసరూపంబు గలది నటనమనియును సెప్పంబడును యిందునృత్తలాస్యంబులు పర్వముల యందు చూడనగును॥

సీ. శుభమహోత్సవముల సొబగునృత్యముజూడ
నాయురారోగ్యంబులతిశయిల్లు॥

వేదమున్నాలుగు వేదంబులం[?]ండి
ననువుగ వాద్యాభి నయనములను
గానర సాదుల గడువడిసమేకూర్చి
గడుదుఃఖ తతులను గడకు దివియ
గారణంబని ధర్మగా మార్ధసిధికి.
గడగినారదునకు గరుణదెల్పె.

గీ॥ సద్ది రారాజసభలందు నర్హమగును
సభయు షట్చాస్త్రి వేత్తల సహితమగుచు
హావభావజ్ఞుడును శాంతయశసు విమల
గుణసమన్వితపతి గూడగూడు సాంభా॥ 5

తా. శుభమహోత్సవములందు సుందరమగు నృత్యమును జూడ ఆయురారోగ్యవృద్ధి నొందునని, బ్రహ్మదేవుడు ఋగ్వేదమునుంచి వాద్యమును యజుర్వేదమునుంచి అభినయమును సామవేదమునుంచి గానమును అధర్వణవేదమునుంచి రసమును సంగ్రహించి సకలదుఃఖములను పోగొట్టునని దయచే నారదునకు నుపదేశించెను గాన నది రాజసభలయందు నాచరణార్హంబై యుండును నాసభయును షట్చాస్త్రివేత్తలగు విద్వజ్జనులతో గూడుకొని హావభావముల గుర్తెరుంగు వాడును శాంతుడును యశోవంతుడును, నిర్మలమైన గుణములుగల సభానాయకునితో గూడియుండవలయును.

సీ. యిట్టిసభాధ్యక్షు డింపుగా ప్రాఙ్ముఖుం
డుగసుహృజ్జనుల గూడుండనదియు
రంగమంటపమందు రమణీయ్యతరపాత్ర
దనవెన్క నటుడు దక్షిణపుపార్శ్వ

మునతాళధారుడు మురజాదగుచు ప్రక్క
వానిప్రక్కలదాన వాద్యపరులు
వెనుకనుశృతిధారి వేడుకగానిల్చి
పాత్రానుసరణిగా పరగవలయు
గీ. పాత్రయునురూపరసగుణ ప్రాజ్ఞయగుచు
లంబకుచకుబ్జ్యపుష్పక్షిలనయుగాక,
హస్తరాంగాంగలయలచే నతిశయిల్లు
పాత్రనాట్యమునిడుశుభ ఫలముసాంబ॥ 6

తా. పైలక్షణములుగల సభానాయకుండు బంధుమిత్రసమేతుండై తూర్పుముఖముగా గూర్చుండియుండ నదిరంగస్థలంబనంబడును అట్టిరంగమధ్యంబున నానాలంకారశోభితయగు పాత్రనిలువనగును దానివెనుక నటుడును దక్షిణపుదిక్కున తాళధరుడును వానిప్రక్కనుమృదంగధరుడును వానిప్రక్కలనుగాన వాద్యములగు వేణు వీణ ఫిడేలు మొదలగువానిని వాయించువారును వారివెనుక శృతిధారియును పాత్రననువర్తించి ప్రవర్తింపవలయును పాత్రయును రూపరసగుణవతి గావలయును కుబ్జయును పుష్పాక్షియు లంబకుచయు కృశాంగియు గాకూడదు హస్తకములయందును రాగములయందును తాళములయందును అంగరాగాదులయందును నేర్పరిగావలయును అట్టిపాత్ర చేయు నాట్యము శుభమునుగలుగజేయును

సీ. తారతాంబ్రములైన దగకాశ్యమునైన
తారాకృతిగముప్వతతులగూర్చి
సిలిత్రాటను ముళ్ళుని మిడిచిపదముల
నూరునిన్నూరుగానుంపవలయు

భరతశాస్త్రజ్ఞుడు బహురూపవంతుడు
సామర్థ్యచతురుడు సత్కులాను
మాన్యుడౌనటుడు మద్దలతాళ శ్రుతివీణ
వేణులు వెలిప్రాణ వితతులగును
గీ. త్యాగయుద్ధైర్యము శ్రద్ధయుదగినమతియు
నవరసాంచితవాక్కులు నశ్రమమును
భ్రమరినిపుణతదృష్టి విభ్రాంతి రేఖ
లనుపదియుపాత్రలో ప్రాణులగునుసాంబ॥ 7

తా. వెండిచేతగాని రాగిచేతగాని కంచుచేతగాని నక్షత్రాకారము లుగా మువ్వలను జేయించి నీలిధారమునగ్రుచ్చినడుమ ముళ్ళు వేయుచునుండవలయును అట్టిజంగులుకుడిపాదంబున నూరును నెడమపాదంబున రెండువందలును యుండవలయును భరతశా స్త్రప్రవీణుడును రూపవంతుడును సామర్థ్యముగలవాడును మంచికులమునబుట్టినవాడును నగు నటుడును మద్దిల తాళము శ్రుతి వీణయు వేణువులనునారును పాత్రకుబహిప్ప్రాణంబు లనం బడును త్యాగయు ధైర్యము శ్రద్ధయు బుద్ధియు మధురవాక్కులు శ్రమలేకయుండుటయు భ్రమరినిపుణత్వము మంచిదృష్టియు ఆనునీపదియును అంతఃప్రాణంబు లనబడును

సీ. గానబూర్వకులచే గరపినధర్మము
ల్గణుతించిగణనాథు గణనజేసి
గురుదైవముల గనుగొనిభజియించి
భక్తిచేసభ వేడి బాడుగీత
మునకర్థమును హస్తములజూపి భావంబు
నేత్రయుగంబుచే నేరుగబరచి

తాళంబుదనపాద తలముసస్లంధించి
రక్తిమార్గక్రియారతినుతించి
గీ. హస్తములపైనిమతినిల్ప నొదుగు రసంబు
బల్కుశబ్దార్థ మభినయం బనగబరగు
హార్యసాత్వికములవాచి కాంగికముల
నగునునాలుగు విధముల నదియుసాంబ॥ 8

తా. గనుక బూర్వికులచే చెప్పబడురీతులు దెలుసుకొని గణపతిని గురువును దైవములను బ్రార్థించి సభావందనముజేసి దాను పాడుచుండు గీతార్థమును హస్తములచేతను భావంబు నేత్రములచేతను తాళము పాదములచేతను గనుబరచుచు రక్తిగల మార్గమునననుసరించి హస్తములపైని మనసు నిల్పునేని రసంబు బుట్టును దానుబలుకుచున్న శబ్దార్థము అభినయం బనంబడును. హార్యము వాచకము సాత్వికము అంగికములని అభినయము నాలుగువిధములుగా నుండును.

సీ. అంగికాభినయంబు నరయముగ్గతులంగ
మవల ప్రత్యంగము పాంగములని
కటిపార్శ్వకరకక్షు గళశిరంబులుసదా
అంగికసంజ్ఞనునతిశయిల్లు
వుదరమూపురపాణి లూరుజంఘులుపృష్ట
మును నెన్నప్రత్యంగములనజెల్లు
మరిజానుకూర్పరమణిబంధములటండ్ర
పాంగముల్మక్కు చెంపలునుచుబుక
గీ. తాలుభ్రూదృష్టిహానువులుతారకలును
అధర జిహ్వ శిరోలప నాంగుళులును

నగునుప్రత్యంగఫల శిద్ధియంగికమున
జెప్పెదసున్నృత్యమునకగు చెల్వుసాంబా॥ 8

తా. అభినయము మూడువిధములై యుండును అందు 1 అంగాభినయనము 2 ప్రత్యంగాభి నయనము 3 వుపాంగాభి నయనము పిరుదులు ప్రక్కలు హస్తములు. శిరస్సు చంకలు మెడ అంగములగును భుజములు హస్తములు వెనుకభాగము కడుపు తొడలు పిక్కలు ప్రత్యంగములు ముంజేతులు జానువులు కొందరు ప్రత్యంగములుగా జెప్పిరి ముక్కు చెక్కిళ్లు గడ్డము నేత్రములు కనుబొమ్మలు కనుపాపలు హనుప్రదేశము అధరము నాలుక శిరస్సు ముఖము అంగుళులు వుపాంగములు అంగాభినయనముచేత ప్రత్యంగాభినయనము శిద్ధించునుగాన నృత్యమునకు తగినరీతియే యిందుచెప్పబడును॥ 8

వనవిధశిరోభేదములు

సీ. సమముగానుంచిన సమశిరంబగునది
స్థంబగర్వక్రోధసమితులందు
ఆరంభనృత్యక్రియాజపరహితవి
శ్వాసంబులకుజెల్లు సంతసముగ
నూర్ధ్వభాగముకెత్తియునుసమంబుగనుంప
నూర్ధ్వాహితంబన నుచితమగును
చంద్రధ్వజవ్యోమచరతుంగమగువస్తు
చయముజూపుటయందు చనుచునుండు

గీ. ముందుదలవంపగానధోముఖమగునది
శిగ్గునకు ఖేదము ఘనదుశ్చింతలందు
మక్కువను మ్రొక్కుటందునుమంచినదుల
దనరిస్నానము సేయంగదగు నుసాంబా॥ 10

తా. శిరస్సుకదులకుండా సమముగనుంచిన నదిసమశిరంబగును 1 నది స్తంభించుటయందును గర్వమందును క్రోధమందును నృత్యారంభమందును జపమునందును క్రియారాహిత్యమందును చెల్లును॥ 1 పైకినెత్తి తిరిగిసమముగానుంచిన శిరస్సు ఊర్ధ్వాహితశిరస్సగును 2 నది ఆకాశమందును పక్షులయందును జండాయందును చంద్రునియందును పొడవగువస్తువులు జూపుటయందును చెల్లును 2 శిరస్సును క్రిందకువంచిననది అధోముఖ శిరస్సగును 3 నదిశిగ్గునందును దుఃఖమందును దురాలోచన చేయుటయందును మూర్ఛయందును ప్రేమతో నమస్కరించుటయందును మహానదులస్నానము చేయుటయందును చెల్లును॥ 3॥ 10

సీ. దలనుజక్రమునలె దగద్రిప్పినిలిపిన
నాలోళితశిరంబటండ్రుబుధులు
గాఢనిద్రమదంబు గనుబిశాచవికల్ప
ములదలదిరుగనుమూర్ఛకగును।
వామదక్షిణములవడిదలగదిలింప
ధుతశిరంబంచునం దురువిబుధులు।
వలివస్తువులయందు వలదు లేదనుటందు
నెడలువీక్షించెదునొప్పునందు।
గీ. జందుగోపమునందునాశ్చర్యమందు
సమరమందప్ద్రావునాసవమునందు

భయభరమునందుబష్పఖేదబటలమందు
దనకుహితవుగ లేదనదగునుసాంబా॥

తా. దలను జక్రాకారముగాద్రిప్పి సమముగానుంచిన నదిఆలోళిత శిరంబగును॥ 4॥ నదిగాఢమగు నిద్రయందును మందమందును దెయ్యముబట్టుటందును దలదిరుగుటందును మూర్ఛనొందుటయందును వికల్పమునందును చెల్లును ॥4॥ శిరస్సును నెడమకుడిప్రక్కలకు క్రమముగద్రిప్పిన నది ధుతశిరస్సనబడును 5 నదిచల్లనిపదార్థములందును వలదనుటయందును లేదనుటయందును దనఅనయనములదాను జూచుకొనుటయందును ప్రబలమైన కోపమునందును హాశ్చర్యమందును యుద్ధమునందును అపుడుద్రావుమద్యమునందును అధికమగుభయమునందును దుఃఖించుటయందును దనకు యిష్టము లేకపోవుటయందును చెల్లును॥ 5॥ 11

సీ. క్రిందికిమీదికి బొందుగాగదలింప
కంపితశిరమనగడగునదియు
బెదిరించుటందును బెడిదంబునందును
ప్రబలుగోపమునందు బశ్నమందు
గూర్చుండుమనుటందుకొమగోప్పశిరమును
ప్రక్కకుద్రిప్పపరాఙ్ముఖంబు
కోపలజ్జాభూణాక్రోమ్ముడుల్గనుటందు
సఖులనాదరణంబునందు చెల్లు
గీ. నుత్క్షిప్తమగునుపార్శ్వోర్ధ్వములచలనము.
పొమ్ము చేకొమ్ము సమ్మతింబోతునవగ
ఖచరవ్యోమచరంబుల గనగబ్రియుల
జూడగనుగొనుటందును జనునుసాంబా 12

తా. శిరస్సును గ్రమముగా క్రిందికి మీదికి ద్రిప్పిన నది కంపితశిరంబ నంబడును 6 నది బెదరించుటందును బెడిదంబునందును అధిక కోపమునందును బ్రశ్న సేయుటయందును వచ్చి కూర్చుండుమనుట యందును చెల్లును॥ 6 శిరస్సును ప్రక్కకు ద్రిప్పిననది పరాంఙ్ముఖ శిరస్సనబడును 7 నది కోపమునందును శిగ్గునందును అంబులపొ దియందును కేశబంధమునందును ఆలాగునసే యనుటయందును చెల్లును 7 శిరస్సును ప్రక్కగా పైకి నెత్తిన నది వుత్క్షిప్తశిరస్స నబడును 8 నది పొమ్మనుటయందును వుచ్చుకొనుమనుటయం దును దయతో రక్షింతుననుటయందును నక్షత్రగ్రహవిమానా దులగనుగొనుటందును ప్రియులజాడలను వెదకి చూచుటయం దును చెల్లును॥ 8 12

సీ. పరగ చామరమట్లు పార్శ్వోర్ధ్వముల ద్రిప్ప
బరివాహితంబన బరిఢవిల్లు
వలచుటా మోదవాగ్వ్యాఖరుల్గనుటందు
విరహవిచారోద్భవితతిగనుట
కగునష్టవిదములకనుదృష్టిబరగును
ననిమిషత్వంబుగా నరయసమము
ఆదియునాట్యాది యందాశ్చర్యమందును
దేవతులాదినిర్దేశ్యమందు
గీ. యితరచింతావినిశ్చయగతులకగును
త్వరనుకనుబొమ్మలను జక్రతతిగద్రిప్పి
నాలోకితంబు వ్యక్తమానస్లజూడ
జక్రభ్రమణేచ్ఛలనుగనజనునుసాంబా

తా. చామరమువలె పార్శ్వోర్ధ్వభాగములయందు ద్రిప్పిన శిరస్సు

పరివాహితశిరస్సనబడును ॥ 9 ॥ నదివలచుటయందును యిష్ట
మునందును సంతోషమందును వాక్చాతుర్యమందును విరహ
మందునువిచారమందును సౌభాగమును జూచుటందును చెల్లును

## అష్టవిధదృష్టిభేదములు

యెనిమిది విధములుగా నేత్రములయొక్క దృష్టిభేదములు
గలవు అందుదేవతా స్త్రీలవలె రెప్పపాటులేక కన్నులుగదుపక
చూచిన నది సమదృష్టియగును నదినాట్యాదియందును ఆశ్చర్యమం
దును దేవతాస్త్రీలయందును గ్రాసుయొక్క ముల్లును జూచుటందును
మరివకఆలోచనము జేయుటయందును నిశ్చయపరచుటందును చెల్లు
ను॥1॥ కనుబొమ్మలను త్వరగాజక్రమువలె ద్రిప్పి స్పష్టముగాజూచిన
నది ఆలోకితదృష్టియగును ॥2॥ ఆది చక్రముసందును భ్రమణమం
దును యుశ్చయందును చెల్లును॥2॥ 13

సీ. కడకంటివరకునుగలయంగజూచిన
సాచిలీక్షణమండ్రుసరసమతులు
ఆశుగగురియందునభిలాషమందును
సంశుగసూచినార్థాదులందు
నాలువునాట్యమునందు దువ్వమీసమునందు
దలచుటయందునుదగునటండ్రు
నుభయపార్శ్వంబుల నోరకన్నులజూడ
ప్రాలోకితంబునప్రాభవిల్లు
గీ. పార్శ్వములవస్తువుల దానుబారజూడ
సంన్న జేయంగగదలగ సొరుగనగ

బుద్ధిజాడ్యాదులకుఁదగి బొల్పుమీఱు
నరగఁజూడ నిమీలిత మగును సాంబా 4

తా. కడకంటివరకును దృష్టివ్యాపించునట్లుచూచినది సాచిదృష్టి యనంబడును ॥3॥ నది బాణమును గురిసేయుటయందును కోరిక యందును కొంగుబట్టుటయందును వ్యభిచారినాట్యమందును మీసము దువ్వుటందును చెల్లును ॥3॥ రెండుప్రక్కలయందును నోరగండ్లగాజూచినది ప్రాలోకితదృష్టియగును ॥4॥ నది ప్రక్కనుండు వస్తువులనుజూచుటందును సంజ్ఞచేయుటయందును గమలుటయందును సౌందర్యమును జూచుటందును మతిమాలుటందును చెల్లును ॥4॥ సగముకన్నులు మూయనిమీలితదృష్టియగును 5॥

సీ. మాన్యశౌఁగుషులందు మదమెక్కువగుటందు
మరచుటందును దైవమననమందు
మ్రొక్కుటందును సూక్ష్మ మొనరజూచుటయందు
జెల్లుపైకినిదృష్టి జెలువమొప్ప
జేసి క్రిందుగద్రిప్ప జెల్లునుల్లోకితం
బదిబూర్వభవతోరణాదులందు
ధ్వజమున్నందౌన్నత్యమగువస్తువులయందు
దేవమంటపమందు దేజరిల్లు

గీ. అగుననువృత్తదృష్టిమీఁదరయు నెడల
కోపప్రీత్యాదులనుజూడ కొమరుమీఱు
నావలోకితమగు క్రిందునరయునేని
ఛాయగనుగొనజనువంగ జనును సాంబా ॥15॥

తా. పైనజెప్పిన నిమీలనదృష్టిమును నేషమందును మదమెక్కువగుటయందును మరచుటయందును దైవప్రార్థనము జేయుట

యందునున మస్కారమును జేయుటయందును కొద్దిచూపుచూ
చుటయందును చెల్లును॥ 5 ॥ దృష్టినిపైకిద్రిప్పి క్రిందుగాజూచిన
నది నుల్లోకితదృష్టియగును॥6॥ నదిపూర్వజన్మమునందును ధ్వజ
మునందును గోపురమందును పొడవగువస్తువులయందును దేవ
తామంటపమందును చెల్లును॥6॥ క్రిందికిమీఁదికి ద్రిప్పినదృష్టి యను
వృత్తదృష్టియగును ॥ 7 ॥ నది కోపముతోఁగాని ప్రీతితోఁగాని
చూచుటయందును చెల్లును ॥7॥ క్రిందిగాజూచిన నది యవలో
కితదృష్టియగును ॥8॥ నది సిగ్గుజూచుటయందును చనువుటయం
దును చెల్లును ॥8॥

## చతుర్విధగ్రీవాభేదములు

సీ. అడ్డంబుగాద్రిప్ప నగుసుందరగ్రీవ
మది స్నేహమోదయుత్సాదులందు
దలచుటకునుమంచిదనుటకు దగియుండు
నిరుగడలురగంబు కరణిగళము
క్రమముగాద్రిప్పతిరశ్చీనమగునది
ఖడ్గభ్రమణనాగగతికి చెలు
నర్ధచంద్రాకారమలరప్రక్కలద్రిప్ప
పరివర్తగ్రీవమైపరగునదియు
గీ. నందముగనాడుటందును నరులబోఁడ్ల
చెక్కులనుచుంబనము చేయ చెల్లుచుండు
కంపితముపావురము గతిగళముద్రిప్ప
నగునుడోలార్థనాట్యంబులందు సాంబా॥ 16

తా. అడ్డముగా త్రిప్పినకంఠము సుదరగ్రీవ మనంబడును॥ 1 ॥ నది స్నేహమందును యత్నమందును సంతోషమునందును వెనుకటివృత్తాంతంబునుదలచుకొనుటయందునుమంచిదనుటయందును చెల్లును ॥ 1 ॥ పాముసడుచునట్లు రెండుప్రక్కలకు దిప్పినకంఠముతిరశ్చీనగ్రీవంబగును ॥2॥ నదికత్తినిద్రిప్పుటందును పామునడకయందును చెల్లును ॥2॥ అర్ధచంద్రాకారముగా నిరుప్రక్కలకు ద్రిప్పినకంఠము పరివర్తగ్రీవమగును ॥3॥నదిఅందముగా నాట్యమాడుటయందును స్త్రీల చెక్కిళ్ళు ముద్దుబెట్టుకొనుటయందును చెల్లును ॥3॥ పావురపుకంఠమువలె వెనుకకు ముందుకు గ్రమముగా ద్రిప్పుమెడకంపిత గ్రీవమగును ॥ 4 ॥ నది నుయ్యాలయూగుటయందును నాట్యమందును చెల్లును ॥ 4.॥

ద్వాదశప్రాణములు

సీ. సకలహస్తములకు సమ్మదంబగుచును
దిరెండుప్రాణముల్బరగుచుండు
హస్తాంగుళులుజూపనది ప్రసారణముకుం
చితముచైముదువరేచితముగదుల
నరమోడ్పుపుంకితం పబవేష్టితముక్రిందు
వెన్కప్రేరితమునుద్వేష్టితంబు
పైకివ్యావృత్తియుబార్శ్వముల్పరివృత్తి
నెంచిజూచియుజేతులోగిగపల్ప
గీ. సమధికవిహీనమగువ్యూహ సంజ్ఞకంబు
వస్తురూపఘునస్థానవరపతాక

చిల్కు యోజనచేష్టలు చిహ్నమగును
వ్యంగ్యశబ్దార్థముగ టీక వెలయు సాంబ. 17

తా. సకలహస్తములకు పండ్రెండు ప్రాణములుగలవు అందు, హస్తముల యందలి వ్రేళ్ళను జాచిన నది ప్రసారణ ప్రాణమగును వ్రేళ్ళు ముడిచిన కుంచిత ప్రాణమగును గదలించిన రేచిత ప్రాణమగును సగము ముడిచిన పుంఖిత ప్రాణమగును క్రిందుగా జేసిన అపవేష్టిత ప్రాణమగును వెనుకకు వంచిన ప్రేరిత ప్రాణమగును పైకి నెత్తిన ఉద్వేష్టిత ప్రాణమగును ప్రక్కలయందు పైకి నెత్తిన వ్యావృత్త ప్రాణమగను చేతులు జాచినను ముంచినను గదలించినను పరివృత్త ప్రాణమగును ప్రత్యక్ష కారణము లేని మనోత్సాహ సంకేత ప్రాణమగును వస్తువయొక్క రూపము స్థానము నిశ్చయము జండాగాణ ప్రయోజనము చేష్టలు చిహ్న ప్రాణమగును స్వచ్ఛమగు శబ్దము యొక్క అర్థనిశ్చయము టీకా ప్రాణమగును 12

సుప్రసిద్ధములగు త్రింశదసంయుతహస్తములు

సీ. అంగుష్ఠమునువంచి నరచెయ్యిజాచిన
నదియుబతాకంబునగనొప్పు
వనమునందుసిషిధవస్తుచయంబందు
వాయువందును ప్రతివర్షమందు
గమనమందుసమంబుగానుంచుటందును
బోడయండయందు గాబోవుటందు
సుకృతిక్రమమునందు సురసమోహమునందు
సంబోధనమునందు సంగ్రదమందు

గీ. ఆత్మవిని యోగమ్మందునునశ్వమందు
నతిశయాశిషమందునునలలయందు
అంబుదమునందునచటను ననుటయందు
గమనశయనాదులందది గడగుసాంబా॥ 18

తా. అంగుష్టమునువంచి దక్కినవ్రేళ్ళను సమముగాజాచిననదిబతాక

హస్తమగును 1 నదివనమునందునువస్తువుల నిషేధించుట
యందును గాలియందును సంవత్సరము నందును, నడు
చుటయందును సమముగా నున్నదనుట యందును
విస్తారమగు యండయందును కాగలదనుట యందును
మంచివరుసయందును దేవతాసమూహమునందును సంబోధనము
నందునుసముద్రమునందును తనగార్యమునందును గుర్రమునం
దును ఆశీర్వదించుటయందును తరంగములయందును మేఘము
యందును అక్కడనే యనుటయందును ప్రక్క వేయుటయందు
ను వెళ్ళుమనుటందును చెల్లును॥

సీ. కడువడినలబతాకమునంద నామిక
ముడువగద్రుపతాకమునగునదియు
మకుటంబునందునమరనాథునకుశ్రీల
మకరికాపత్రాగ్ని మంటయందు
పరివర్తనమునందు పతిబత్తునలనుటందు
బాణకపోలసంభావనందు
కులిశంబునందును కుటజార్థమందును
గేదంగిసుమమందు గేలియందు

గీ. నందుజిటికినవ్రేలొంపనరబతాక
మదిజిగురుబల్కగోపురమనుటయందు

త్రుత్కకకచక్రాంగకేతనశోభలందు
గట్టునందిద్దరనుటందు గడగుసాంబా॥ 19

తా. వెనుకజెప్పినపతాకహస్తమునందు అనామికవ్రేలువంచినయది



త్రిపతాక హస్తమగును ॥ 2 ॥ నది కిరీటమునందును దేవేద్రునియందును స్త్రీలమొకరి కాష్ఠత్రములయం దును అగ్నిమంటల యందును పరివర్తనము చేయుటయం దును దంపతులయందును బాణమునందును చెక్కిళ్ళ యందును కులిశాయుధమునందును వృక్షమునందును మొగలి పుష్పమునందును ఆక్షేపించుట యందును చెల్లును॥ 2



త్రిపతాక హస్తమునందు జిటికినవ్రేలును వంచిన నది అర్థపతాకహస్తమగును॥ 3 ॥ నది లేతచిగుళ్ళయం దును పలకయందును గోపురము నందును జండా యందు ను పర్వత శిఖరమునందును మంగలికత్తియందును రంప మునందును గట్టునందును యిద్దరనుటందును చెల్లును॥3॥

సీ. అరిపతాకంబున నంగుళు లెడజేయ
గర్తరీముఖమనంగనుగడంగు
నదిదంటబాయుట వ్యత్యస్తమైనస్థా
నమునందు దొంగతనంబునందు
క్రిందనుబడుటందు క్రీగంటిచూపందు
డిందుమించందు ఖండించుటందు
పడకబాయుటయందు పవరంపుమృతియందు
పరగుశాఖాలతా పటలమందు
గీ. నందనామికనంగుష్ఠమందుజేర్చి
నన్నమునగు(?) నేళ్ళుజాపగనగుమయూర

హస్తమదితీగతిలకమ్ము హరియు కేకి
నెసలుగన్నీరుగురులందు నొప్పసాంబ ॥20॥

తా. పైనిజెప్పినఅర్ధపతాక హస్తంబునందు తర్జనీమధ్యమములు యెడముగా జేశి జూపిన కర్తరీముఖ హస్తమగును ॥ 4 ॥



నదిదంటబాయుటయందును వ్యత్యస్తమగుస్థానమందును దొంగతనమునందును క్రందను బాపుటయందును కీగంటి ప్రసారమునందును మెరుపునందును ఖండించుటయందును పడకిగ యుటయందును యుద్ధమున మృతినొందుటయందును చెల్లును॥ 4 ॥ పైకర్తరీముఖహస్తంబున అనామికవ్రేలుసుఅంగుష్టముతో జేర్చి అన్యనుగవ్రేళ్ళుచాచిన మయూరహస్తంబగును॥ 5 ॥



నది తీగయందును తిలకమును దిద్దుకొనుటయందును కోతియందును నెమలియందును కనుబొమ్మలయందును కన్నీళ్ళు తుడుచుటయందును ముంగురులదీర్చుటయందును చెల్లును 5

సీ. మునుబతాకాంగుష్ఠమును నెడజేసిన
నదియయర్ధచంద్రాఖ్యహస్తమగును
నదియర్ధశశియందునభిషేచనమునందు
నవయవముల ప్రేమ నంటుటందు
భల్లాయుధమునందు ప్రాకృతిపురుషుల
ప్రణుతియందును దైవప్రార్థనందు
దనుదాను దెలుపను ధ్యానంబుసేయను
దినుగిన్నె మొడబట్టి దిపురుటందు

గీ. తర్జనబతాకమునవంప దగును రాళ్ళ
హస్తమది మంచి యమృతాదుల ననుభవింప

ఛండతరమారుతమునంగు జనునుయంద
నామికనువంప శుఖవదనంబుసాంబా 21

తా. ముందు జెప్పిన బతాకహస్తమున బొటనవ్రేలు వంచినది అర్థచంద్రహస్తమగును ॥6॥ నది యర్థచంద్రునియందును అభిషేకము చేయుటయందును ప్రేమతో శరీరమును నిమురుచుటందును భల్లాయుధమునందును సామాన్యుల నమస్కారమందును ప్రార్థన చేయుటయందును తానుదాను దెలుపుకొనుటయందును ధ్యానముచేయుటయందును ఆసనముదిను గిన్నెయందును మొట్టబెట్టి గిట్టుట యందును చెల్లును ॥6॥ పైబతాకహస్తమున తర్జనివ్రేలువంచిన యెడల అరాళహస్తమగును ॥7॥ నదిమంచియమృత పదార్థములు భుజించుటయందును ప్రళయవాయువునందును చెల్లును॥7॥ పైఅరాళహస్తంబున అనామిక వ్రేలువంచిన శుకతుండహస్తమగును 8







సీ. బాణప్రయోగోగ్ర భావంబులందును
బరిమరాహాశ్యముల్బలుక్కటంగా
కుంతాకృతినిజూప కొమరొప్పుచుండును
ముష్టిహస్తము వ్రేళ్ళు ముణచిజూప
స్థిరమనుటందును సిగబట్టుటందును
వస్తువిభాగ వినాదమందు
ముష్టిహస్తాంగుష్ట మునునూర్ధ్వమున కెత్త
శిఖరహస్తంబన చెల్లుదాని
గీ. మదన కార్ముకశక్తితో మరములందు

పితలతర్పణమందున్ బ్రియునియందు
కౌగలించుటయందును కట్టుటందు
నోష్ఠరదనాదులనుజూప నొప్పు సాంబ 22

తా. పైనజెప్పినశుకతుండహస్తము బాణమున్బ్రయోగించుట యందును రహస్యమగు వాక్యములను బలుకుటయందును కుంతమనునాయుధమును జూపుటయందును నుగ్రమగునభిప్రాయమందు నురహస్యమగు మాటలుచెప్పుటందును చెల్లును ॥8॥



వ్రేళ్ళను ముడిచిజూపిన నదిముష్టిహస్తమగును ॥9॥ నది స్థిరమనుట యందును శిగబట్టుకొనుట యందును వస్తువులువేరుజేయుటయందును వివాదమునందును చెల్లును॥9॥



పైనజెప్పిన ముష్టిహస్తమునందలి అంగుష్ఠమునుపైకినెత్తిన నది శిఖరహస్తంబగును ॥10॥ నది మన్మథునియందును ధనస్సునుబట్టుటందును శక్తియను నాయుధమును బట్టుకొనుటందును శ్రోమరమందును పితృదర్పణముచేయుటయందును బ్రియునియందును కౌగలించుకొనుటయందును కట్టుటయందును అధరోష్ఠమును జూపుటయందును దంతములగనుపరచుటయందును చెల్లును ॥10॥

సీ. శిఖరహస్తాంగుష్ఠశిఖను తర్జనివ్రేలు
చంపకపిధాఖ్యవలనుమీరు
లలిరమాభారతు లకుదూపదీపాదు
లకుపాలుపిదుకుట లకునుపూల
చెండ్లనుధరియింప చెరగుచేతనుబట్ట
చేతతాళముగొట్ట చెల్లుచుండు
[illegible]

కటకాముఖంబున గడగునదియు

గీ. బువ్వులనుదండలుగగూర్పబూలుగోయ
బాణమునుమెల్ల గనుసీడ్వ బాగలిడగ
గంధవాసనలనుగ్రోలగప్పురాది
వస్తు వులనింపబలుకాడవర్థలుసాంగా ॥23॥

తా. ముందుజెప్పిన శిఖరహస్తాంగుష్టముపైని తర్జనవ్రేలునంచి జూపిన నది కపిథహస్తమగును ॥ 11 ॥ నదిలక్ష్మీదేవియందును



సరస్వతియందును దైవమునకు ధూపదీపాదు లర్పణము చేయుటయందును పాలుపిదుకుట యందును పువ్వులబంతులను ధరియించుటయందును చెంగుబట్టికొనుటయందునుచేతతాళము వాయించుటయందును చెల్లును॥ 11

మధ్యమాంగుష్టములు తర్జనవ్రేలుతో జేర్చియితరమగువ్రేళ్లు



జాచి జూపిన నది కటకాముఖహస్తంబగును ॥ 12 ॥ నది పువ్వులను దండలుగా జేయుటయందును పువ్వులనుగోయుటయందును బాణమును సంధించుట యందును విడియమునిచ్చుటయందును పరిమళద్రవ్యములు వాసనజూచుటయందును కర్పూరము మొదలగువస్తువులు గలుపుటయందును మాటలాడుటయందును చెల్లును ॥12 ॥ 23 ॥

సీ కటకాముఖంబున గలతర్జనినియెత్తి
జూపినదియగు సూచిముఖము
బానునియందును భావించుటందును
నొకటినూరని లేఖనుడువుటందు
నలరుగ్రామమునందు నగునట్లనుటయందు
యవ్వడెవ్వతియేది యందనంగ
నదివాడనుటయందు నచ్చరువందును

సతికృశమందుమూలనుటయందు

గీ. భేరివాయించుటకుబుద్ధి భేదమందు
జడనుభాలించుటందును జక్రమందు
వ్యజనమందుదినాంతర వేళయందు
చిత్ర దేహాళలాకసన్నను సాంబా 24

తా. పైకటకా ముఖహస్తంబున తర్జన వ్రేలునెత్తి జూపినది సూచి



ముఖహస్తమగును ॥12॥ నదిసూర్యునియందును ధ్యానించుటయందును నకటి నూగుయని లెక్కబెట్టుట యందును పట్టణమునందును సతులనగుననుటయందును యనసు యన తైర్యోనియందు ఆదివారము ఆమెయను నర్థములయందుసునాశ్చర్యమందును మిక్కిలిబిక్కుటయందును మూలయనుటయందును భేరి వాయించుటయందును భేదించుటయందును జడనుభావించుటయందును జక్రమునందును విసినికర్రయందును సంధ్యకాలమునందును గొడుగునందును దేహమునందును నూగారుయందును శలాకయందు చెల్లును॥ 13

సీ. పైసూచికరములోపలను నంగుష్టము
జాపగ నది కళాచంద్రుడగును
ఫుంఖితాంగుళుల నింపుగగూర్చిజూపిన
పద్మకోశంబన్నరగుచుండు
దక్షాండములయందు దనుశిపాలిశ్శందు
పాముపుట్టందునుత్పలములందు
మంకెనబువ్వందు మారెడుబండందు
కువలయంబందుబూగుత్తియందు
గీ. నాంబ్రఫలమందు లిదులవాననుటయందు

నల్పాహార కపిద్ధఫలంబులందు
వర్తులమునందు చందులవైఖరందు
ఘంటరూపంబుజూపంగగడుగుసాంబా ॥25॥

తా. పైసూచిముఖహస్తంబునందు అంగుష్టమును జాపినసది చంద్ర



కళాహస్తంబగును ॥14॥ నది కళామాత్ర చంద్రునియం దు చెల్లును 14 అభయహస్తంబును పుంఖితబాణంబుతో గూర్చిజూపిన నది పద్మకోశ హస్తంబగును 15 నది కో డిమొదలగువాటి గుడ్లయందును స్త్రీలస్థనములయందు



ను పాము పుట్టయందును నల్లకలువలయందును మంకె నబువ్వనందును మామిడిబంపునందును భూమింకిదును బువ్వులగుత్తియందును మారేడుఫలమందును బుష్పవర్ష మందును అల్పాహారమునందును వెలగఫలము నందును గుండ్రమగు వస్తువులయందును బంతి యందును ఘంట యందును చెల్లును ॥ 25 ॥

సీ. అలపతాకంబున నరచెయ్యి కొంచము
నొంపనోరగశిరంబొప్పుచుండు
మంచిగంధమునందు మంత్రోదకమునందు
మదగజశిరము నెమర్చుటందు
మహానియ్యఫణిశిర మందుమందంబందు
దేవదర్పణమందు దేజరిల్లు
నందునాద్యంతంబులగునంగుళులుజాప
నదిమృగశిరమన నలరుచుండు

గీ. కామినులచెక్కులకు కుచకలశములకు
ఘనదలంకారమిలుపడికట్టులందు

సకలమగువస్తువులుఁజేర్చ సంచరింప
వెరపునందు వివాదందు వెలయుసాంబా

తా. పైనిచెప్పిన బతాకహస్తంబున నరచెయ్యికొంచము పల్లముగా



వంచిజూపినది సర్పశీరుష హస్తంబగును 16 నదిమంచి గంధమునందును మంత్రోదకమునందును మదవుటేను గుశిరస్సునెమర్పుటందును మందమందను పామపదగ యందును దేవతులకు దర్పణముచేయుట యందును చెల్లును 16 పైసర్పశీర్ష హస్తంబుననంగుష్ట కనిష్టికము లుజాపిన



నది మృగశీర్ష హస్తంబగును 17 నదిస్త్రీలకుచములయందును చెక్కిళ్ళయందును నలంకరించుట యందునుగృహమునందును పడికట్టునందును సకలవస్తువులనుచేర్చుట యందును సంచరించుట యందును వెరపునందును వివాదమందును చెల్లును. 17

సీ. మధ్యమాంగుష్టముల్మరినామిక జేర్ప
శింహ్వాముఖంబనన్నిధి చెందు
కుంజరమందునుకుందేలునందును
కమలమాలయుదర్భగదుపుటందు
నైద్యాశౌనధపక్వావైఖరులగ్నశింహ్వా
ముఖమునకును హోమమునకు జెల్లు
పద్మకోశంబులోపల ననామికవంప
లాఙ్గలహస్తమాలంలితముగ

గీ. శాలికాష్టనముల సౌరుబయలుపరుప
ఛాతకరధాంగకముపోతచయముజూప

పోకనింబఫలంబులపొందుబరుప
మువ్వఘంటాకృతులబోల్ప మొనయుసాంబ॥ 26

తా. అంగుష్ఠనానామిక వ్రేళ్ళను మధ్యమముతోఁ జేర్చి దక్కిన వ్రేళ్ళ



నుఁజాపినది సింహాముఖ హస్తంబగును 18 నది యేనుగ
యందును కుందేలునందును కపిలమాలయందును
దర్భపగిలుచుటందును వైద్యులౌషధపాకమును గని
పెట్టుటయందును సింహాముఖమునందును హోమము
నందును చెల్లును 18 పద్మకోశహస్తమునందనామికను
వంచిన నది లాంగూలహస్తమగును 19 నది శాలిక్షేత్ర
ములయందును చాతకములు హంసలుగువ్వలు వీటియా



కారమును జూపుటందును పోకఫలమునందును నిమ్మఫ
లమునందును మువ్వయందునుఘంటయందును చెల్లును19

అంగుళులను విరళాప్తిగాఁద్రిప్పిన
సోలపద్మంబనసొంపుమీరు
చారుతరంబందుచందురునందును
యావర్తనమునందు సద్దమందు
కోలాహలంబందు కోపంబునందును
కొనియాడుటందును కొప్పునందు
వికచనవీనారవిదంబులందును
బడుతుకల్గబ్బిగుబ్బలులయందు

గీ. బాత్రమందునుబండినబండునందు
బాయుటందును కలరవబంక్తులందు
గొప్పదనమందు మేడందుగుంటయందు
గ్రామమందునుగ్రహమందుగ్రాలుసాంబ॥ 27

తా. వ్రేళ్ళు విరళములుగా జేసినర్ధచెయ్యి పల్లముగునట్లు ద్రిప్పిజూపిన



నది సోలపద్మహస్తముగును 20 ఆదిచక్కదనమందును చంద్రుని యందును సుడియందును అద్దమునందును కలకలధ్వనియందును కోపమునందును కొప్పునందును కొనియాడుట యందును వికశించు కమలమందును స్త్రీలకుచములయందును జాత్రయందును బండినఫలమందును బాయుటయందును జక్కవ బక్షులయందును గొప్పదనమందు నుమేడయందును కొలనుయందును గ్రామమందును గ్రహము నందును చెల్లును 27

సీ. దగదర్జనాది గాదనరుమూడంగుళి
　　ములగల్పి నామికామూలమందు
సంగుష్టమునువంచి నలకనిష్టకజాప
　　చతురహస్తంబనన్జనునునదియు
స్వర్ణంబు నందురసాస్వాదనమునందు
　　సరసంబునంను నాసవమునందు
తైలాదులందునుతడియందుతాంబ్రాది
　　లోహాలోచనయుగ్మలోలతలకు

గీ. దనరుమృగనాభిఛాయభేదంబునందు
మందగమనంబు నందుబ్రమాదమందు
కొంచమనుటందు తునకలకొమరునందు
దుఃఖమునకొప్పుదురితవిదూరసాంబా

తా. తర్జనవ్రేలు మొదలు మూడువ్రేళ్ళుజాచి అనామికవ్రేలు మొద



ట బొటనవ్రేలువంచి చిటికెనవ్రేలుజాచినయది చతుర హస్తంబగును 21 యది బంగారమునందును రసమును ద్రావుటందును సరసములాడుటను మధ్యమమునందును తైలాదులందును తడియుండుటను తామ్రాదిలోహములయందును నేత్రములయందము జూపుటయందును కోపముగయందును వర్ణభేదమునందును మెల్లగా నడచుటందును బ్రమాణమునందును కొంచ మనుటందును తునకలగుటందును దుఃఖపడుటందును చెల్లును 21

సీ. అంగుష్టమునుమధ్యమాంగుళంబును జేర్చి
మునిచిత్తజనినస్యములనుజూప
భ్రమరహస్తంబది భ్రమరయోగంబందు
హరిబిక బెగ్గురులందు జెందు
నడివ్రేలుమొదలుగా నగువ్రేళ్ళు వెలిజాచి
అంగుష్టతర్జనులరయుగూర్ప
హంసాస్యమది సోహమనెడిభావంబందు
బొట్టుగట్టను నీటిబొట్టునందు

గీ. వత్తినగమీటుటందును వరయుటందు
పులకలందునుముత్తెంపుపూసలందు
బలుకుటందునుదృఢమందు బటమునందు
చిత్తరులయందుసుమమందు చెల్లుసాంబా॥ 29

తా. మధ్యమవ్రేలు అంగుష్టమున జేర్చి తర్జనవ్రేలువంచి దక్షిన



వ్రేళ్ళుజాచిన నది భ్రమరహస్తంబగును 22 నదితుమ్మెద యందును బెగ్గురుపక్షులయందును యోగధ్యానమందును కోవిలయందును చెల్లును 22 నడిమివ్రేలు మొదలుకొని మూడువ్రేళ్ళు నెడముగా జాచి తర్జనివ్రేలునంగుష్ఠమున జేర్చినదది హంసాస్యహస్తంబగును 23 నది సోహంబను



అభిప్రాయమందును పుష్పముడివేయుటయందును నీటిబొట్టునందును వత్తి నెగమీటుటయందును వరపుటయందును గగురుపాటునందును ముత్తెపు పూసలయందునుమాటలాడుటయందును ధైర్యమందును బటము వ్రాయుటందునుచిత్రలేఖనమునందును మల్లెపువ్వులదండయందును చెల్లును. 23

సీ. నురగసిరంబందు నెగికనిట్టకజాప
హంసపక్షాఖ్యను నతిశయిల్లు
గట్టుగట్టనుగోటగాబోవుననుటందు
గురినందునారని గూర్చుటందు
లలిపద్మకోశాంగుళములు వేమరుజాప
సందంశహస్తమౌసమ్మతముగ
బలినిచ్చుటందును బహుగాయమందును
బురుగునందునుభీతి బుట్టుటందు

గీ. హరిహరాద్యర్చనమునందు నైదునందు
తగునుదారతయందునుదగునటంద్రు
మునుచి వ్రేళ్ళనుజూపగ ముకుళమదియు
దానజపభోజనములందు దగునుసాంబా॥

తా. సర్పశీర్షహస్తంబునందు జిటికినవ్రేలునుజాచిన నది హంసపక్ష



హస్తంబగును 24 నది గట్టి వేయుటయందును గోరుచేన
గునసుటయందును గుదిశేయుటయందును ఆరుదుని చెప్పు
టయందును చెల్లును 24 పద్మకోశహస్తము వ్రేళ్ళనుతిరి
గీ తిరిగిజూపిన నది సందంశ హస్తమగును 25 నది బలిని



వేయుటయందును బడినగాయము నందును క్రిమి
యందును భయము గలుగుటయందును శివకేశవుల
బూజించుటయందును ఆయుధములని చెప్పుట యందును
దగిన ఆతిశయమందును చెల్లును 25 వ్రేళ్ళను ముడుచి



జూపిన నది ముకుళహస్తంబగును 26 నది దానమందును
జపమునందును భోజనమునందును చెల్లును 29

ముకుళహస్తంబున ముడువతర్జన వ్రేలు
తాంబ్రచూడంబనదనరునదియు
కొంగవంటెయుదూడ కోడికాకము వ్రాలు
ముల్లోకములు శూలములకుదగును
నాద్యంతములయందు నమరు వ్రేళ్ళనువంచి
సేషాంగుళులనెడ జేసిచూప
నది త్రిశూలాఖ్యహస్తంబననలగును
బిల్వత్రిసంఖ్యకు బేర్మినొప్పు

గీ. పద్మకోశాంగుళులవంప బరుగుపూర్ణ
నాభమదిమృగకమఠవానరములందు
నర్ధసూచిక పిద్ధమధ్యమముజాప
శాబకాంకురక్రిములందు జనునుసాంబ॥ 32

తా. పైముకుళ హస్తమునందు తర్జనవ్రేలును సగ్గముచంచిన నది తాంబ్రచూడహస్తంబగును 27



నదికోళ యందును వంకెయందును దూడయందును కోడి యందును కాకియందును వ్రాలుయందును మూడులోక ములయందును శూలమునందును చెల్లును 27 నంగుష్ట



కనిష్టములు నంచిసేపించిన వ్రేళ్ళను నెడముగానుంచి చాచిననది త్రిశూల హస్తమగును 28 నది మారేడి దళములయందును మూడయను సంఖ్యయందును చెల్లును



28 పైపద్మకోశహస్తము వ్రేళ్ళుముడిచి జూపిన నదివూ ర్ణనాభహస్తమగును 29 నది తాబేలునందును కోతి యందును మృగముఖము నందును చెల్లును 29 పైకపి



ధహస్తమున మధ్యమవ్రేలు జాపిననది అర్ధసూచిహస్త మగును 30 నది మొలకలయందును క్రిములయందును చెల్లును 30

సుప్రసిద్ధమగు నిరువదినాలుగు సంయుత హస్తంబులు

సీ. నీయసంయుతములు నినుమడిగాగూర్చ
సంయుతంబులు ననసమ్మదమగు
అందుముఖ్యంబులైయలరు నిర్వదినాల్గుగు

నాట్యానుగుణములై నమరుచుండు
లాలిత్యపదముల లక్ష్యలక్షణముల
శాస్త్రానుసరణిగా నస్సుతింతు
సంయుతాకములు రెండగ చేతిలో జేర్చ
నంజలిహస్తమౌ నండ్రు బుధులు
గీ. దైవగురువిప్రవరులకు దలకి మ్రొక్క
నిటలముఖహృదయములందు నిడగవలయు
యుక్తి గాహితోక్తి నుగుణినమోక్ష ధ్యాన
శివస్వరూపము నిరూపించ జెల్లు నంజలి ॥ 33

తా. పైయసంయుత హస్తములను రెండు చేతులలో జేర్చి చూపు
చున్న యెడలను ననేకములగు సంయుతహస్తంబులు పుట్టు చుం
డును అందు నాట్యమునకు దగునీతిగా నియుగునది నాలుగు ముఖ్యము
లైనవి మృదువగు పదములతో లక్ష్యలక్షణములు శాస్త్రవిధి
గా యిందు వ్రాయబడుచున్నవి రెండుపతాకహస్తములు నగచే
తిలో జేర్చి జూపినది అంజలి హస్తమనంబడును 1 నది దేవతలకు
నమస్కరించునపుడు సిరస్సునందును గురువులకు నమస్కరించు
నపుడు ముఖమునందును బ్రాహ్మణులకు నమస్కరించునపుడు
హృదయమునందును జేర్పవలయును మరియును యేమిసేయు
దుననుటయందును వినయమునందును ధ్యానము చేయుటయందు
ను యీశ్వరునిరూపము నిరూపించుటయందును చెల్లును1 33

సీ. అంజలిహస్తంబునందాది తుదపార్శ్వ
కరకలనకపోత కరమనబడు
నరటిపుష్పమునందు నంగీకరణమందు
నమృతవస్తుగ్రహణంబునందు

సంపుటశితపూగసత్ప్రమాణమునందు
వినయమాదీఫల వితతులందు
అన్యోన్యమంగుళు లంతరాళములుగా
జేర్పకర్కటమన జెల్లుచుండు
గీ. దుఃఖవచనంబులందునుతుంగమందు
కటకమందునుగొమ్మనుగదుపుటందు
మూగుమూకందు పెనుదరమూపుటందు
తానుదేహశ్రమముబాపదగునుసాంబ॥ 34

తా. పైఅంజలిహస్తముయొక్క చివర మొదటిభాగములు సమముగా
జేర్చిన యడనది కపోతహస్తమగును 2 ఆది అరటిపువ్వునందును
అంగీకారమందును అమృతయుక్తమగు వస్తువులుగ్రహించుటం
దును భరణియందును తెల్లపోకలయందును సత్ప్రమాణము
నందును వినయమందును మాదీఫలమునందును చెల్లును 2
పరస్పరము వ్రేళ్ళను నొండొంటితో నంతరాళములుగా జేశిచూ
పిన నది కటకహస్తంబగును 3 నది దుఃఖవాక్యముల యందును
నానలించుటయందును ప్రిడకాయయందును కొమ్మనుగదుపుట
యంగనుశరీరాయాసమును దీర్చుకొనుటయందును చెల్లును 34

సీ. మఱిబతాకయుగంబు మణికట్టులతో జేర్ప
స్వస్తికహస్తమౌ సమ్మతముగ
వరుణాశ్వమందు వివాదందుభయమున
వాపోవుటందు స్థవంబునందు
నూరుదేశంబున నుంపబతాకము
ల్పదియుడోలానామ హస్తమగును

నధిక మందంబందు నాలశ్యమంగును
మోహాధికవిలాసమూర్ఛలందు

గీ. సర్పశిరదుగి కరములు సంపుటంబు
పుష్పపుటహస్తమది మంత్రపుష్పమందు
దానహారతులకు నర్ఘ్యదానమునకు
ధాన్యసుమఫలములుగొన దగును సాంబ 35

తా. పైన జెప్పిన రెండు పతాకహస్తంబులు మణికట్టులయందు జేర్చిన నది స్వస్తికహస్తంబగును 4 నది మొసలియందును వివాదమందును భయముతో దూషించుట యందును వర్ణించుటయందును జెల్లును 4 తొడలకు సమముగా రెండు పతాకహస్తంబు లుంచిన నది డోలాహస్తమగును 5 నది విక్కిలి మందమందును ఆలస్యము చేయుటయందును మోహమునందును విలాసమునందును మూర్ఛయందును జెల్లును 5 రెండు సర్పశీర్షహస్తంబులు సంపుటముగా గూర్చిన నది పుష్పపుట హస్తంబగును 6 నది మంత్రపుష్పమునందును అర్ఘ్యదాన మునందును హారతినిచ్చుటయందును ధాన్యము పుష్పాలు పండ్లు చేకొనుటందును చెల్లును 6 35

సీ. బాహుమూలమునుంప బడుమృగశిరములు
నుత్సంగమగునంచు నుత్సహింత్రు
నాలింగనమునందు నతిసిగ్గునందును
నామోదకుచగోప నములయందు
నర్థచంద్రాస్థంబునందు శిఖరముంప
శివలింగమగునది శివునియందు
కటకాముఖద్వందగములురుబందంబు
కటకవర్ధనమనగ దగునదియు

గీ. పరిణయాశీర్వచనపూజపట్టబంధ
జక్కిణీనాట్యరతిఖేదజగ్గదండ
లాస్యకోపోపశమవాక్యలాలనముల
యాఢి తృణరణములకునా యాఢిసాంబ 36

తా. రెండుమృగశీర్ష హస్తములు భుజమూలములందు జేర్చినది ను త్సంగహస్తమగును 7నదికౌగలించుకొనుటందునుచిక్కిలిసిగ్గునం దును అంగీకారమందును స్తనముల మరుగుచేయుట యందును చెల్లును 7 కుడిచేత శిఖరహస్తము నెడమచేత అర్ధచంద్రహస్త ము హృదయసమీపమున బట్టిజూపినది శివలింగహస్తమగును 8 నది శివునియందు చెల్లును 8 రెండుకటకాముఖ హస్తములు స్వస్తికాకారముగా జూపినది కటకావర్ధన హస్తమగును 9 నది పెండ్లిదీవనయందును పూజయందును పట్టాభిషేకమునందును జక్కిణీనాట్యమందును శృంగారమందును విచారమునందును జటకోలాటము వేయుటయందును కోపోపశమనమును చేయు టయందును తృణమునందును రణమునందును చెల్లును 9 36

సీ. మునుకర్తరీహస్తములస్వస్తికంబుగా
గలయగర్తరిస్వస్తికమున వెలయు
దిగపర్వతాగ్రపాదపశాఖలందగు
భ్రమరహస్తయుగంబుబరగగూర్చి
మధ్యమాంగుష్టముల్మానుగాజూపిన
శకటమైచలగునిశాచరులకు
శిఖరహస్తంబునతీయ్యమాసంగుష్ట
మునునిత్తరాంగుష్టమునసనుగూర్చి

గీ. తర్జనిస్కీమొదలగు వ్రేళ్ళుద్ధగముజాప
శంఖకరమగునది చెల్లుశంఖమునకు
అర్ధశశిహస్తములు రెండు సిద్ధముగను
జేర్పగనుజక్రమగునందు జెందుసాంబా 37

తా. పైరెండుకర్తరీ హస్తములు స్వస్తికాకారముగా గూర్పనది కర్తరీస్వస్తికహస్తమగును 10 నదిపర్వతశిఖరమందును చెట్టుకొమ్మలయందును చెల్లును 10 రెండు భ్రమరహస్తంబులు సమముగా జేర్చిమధ్యమాంగుష్టములుజాపిననదిశకటహస్తంబగును 11 నది రాక్షసులయందు చెల్లును 11 శిఖరహస్తములోనుండు నంగుష్టమును నితరాంగుష్టముతో చేర్చి తర్జనమొదలగు వ్రేళ్ళు జాచిననది శంఖహస్తమగును 12 నది శంఖమునందుచెల్లును 12 అర్ధచంద్రాస్తములు నొకటిపైనొకటి అడ్డముగా జేర్చిననది చక్రహస్తమగును 13 నది చక్రమందు చెల్లును 13 37

సీ. అందువ్రేళ్ళనువంపనగుసంపుటంబన
సదిసంపుటార్థ గోప్యంబులందు
తగసూచికరవక్రతర్జనిబంధంబు
పాశహస్తముబంద పాశకలహ
ములకగుమృగశీర్ష ములకనిష్టకములు
లంకెగాగూర్పగీలకమటంద్రు
స్నేహవినయమందు చెందుబతాకము
లొండొంటిపైనుంచి నొప్పుమీర

గీ. నందుకడవ్రేళ్ళ నొంచిననగునుమీన
నదిద్ధముమధ్యార్థముంద్ధునసమ్మదియముండు

జక్రముననాదితుద్ధ్రవేళ్ళుజాచియితర
ములముడువగూర్మమగుగూర్మమునకుసాంబ 38

తా. పైచక్రహస్తమునందలి వ్రేళ్ళుశించి చూపినసది సంపుటహస్తమ గును 14 సదిసంపుటమునందును ధనాదుల దాచుటయందును చెల్లును రెండుసూచీహస్తముల తర్జనవ్రేళ్ళను లంకెగాగూర్ప సది పాశహస్తమగును 15 సదితాడుతో కట్టుటయందును కలహము నందును చెల్లును 15 రెండుమృగశీర్షహస్తముల చిటికినవ్రేళ్ళ ను లంకెగావేయుసది గీలకహస్తమగును 16 సదిస్నేహమందును వినయమునందును చెల్లును 16 రెండుబతాకహస్తములు నొక దానిపై నొకటిచేర్చి అందుసంగుష్ఠ కనిష్ఠికల జాచినసది మ ఘహస్తమగును 17 సది మత్స్యార్థమందు చెల్లును 17 పైచక్రహస్త మున వ్రేళ్ళుముడిచి అంగుష్ఠచిటికినవ్రేళ్ళను జాచినసది కూ ర్మహస్తమగును 18 సది కూర్మమునందు చెల్లును 18 38

సీ. మునుమృగశిరము లిమ్ముగ జతగాగూర్చి
కనిష్ఠికాంగుష్ఠముల్కలయజేర్ప
సదివరాహకరంబు నగువరాహంబందు
నడ్డంబుగను రెండు నర్ధచంద్ర
కరములంగుష్ఠముల్కలయంగ జేర్చిన
గరుడహస్తంబది గరుడనకగు
మరిసర్పశీర్షముల్మణికట్టుతో జేర్ప
నాగబంధంబన నతిశయిల్లు

గీ. పరగధర్వాణమంత్రజ పంబునందు
నురగబంధంబునందును నురగమిథున

మ్ములనిరూపింపఁ బొదరిండ్లమురువుఁజూప
వనులతరక్రీడలకు నదియగు సాంబా 39

తా. రెండు మృగశీరుష హస్తంబులు జతగాఁగూర్చి అందుకనిష్టికాం
గుష్టములు జేర్చిననది వరాహహస్తంబగును 18 నదివరాహమందు
చెల్లును 19 రెండు అర్ధచంద్ర హస్తంబులు నడ్డముగాఁబట్టి నంగు
ష్టములను జేర్చిననది గరుడహస్తంబగును 20 నదిగరుడునియందు
చెల్లును 20 రెండు సర్పశీర్ష హస్తంబులు మణికట్టులతో జేర్చి బట్టిన
నది నాగబంధహస్తంబగును 21 నది అథర్వణ మంత్రజపమునం
దును నాగబంధంబునందును నాగదంపతులయందును పొదరిండ్ల
జూపుటయందును నిర్గమను క్రీడలయందును చెల్లును 21 39

సీ. చతురశ్రంబుల జతగూర్చి వాటిపై
నంగుష్ఠతర్జనులు మఱజూప
నదిఖట్వ మదిఖట్వమందగు మణిబంధ
మునకపిత్థంబుల నొనరఁజూప
నదిగండభేరుండమను హస్తంబగు
తద్దంపతులయందుఁ దగుననటండ్రు
నలపద్మముల నెదననురంగఁజూపిన
ననహేఁధమదియన నతిశయిల్లు

గీ. నందనుగునాటపాటలయందు సొలపు
కందుకక్రీడలకు కుచకలశములకు
దేనగునుబుధహస్తము తెలిపికొలది
కర్ణచేదిష్టానుగుణముగాఁగలుగు సాంబా 40

తా. పయిన చెప్పిన చతుర హస్తంబులు నొకటిపైనొకటి జేర్చిఅందు
అంగుష్టతర్జని వ్రేళ్ళను జోచిననది ఖట్వాహస్తంబగును 22 నది

మంచమునందు చెల్లును.22 రెండుకపిధహస్తంభులు మణికట్టు తోజేర్చి బట్టినదది గండభేరుండహస్తంబగును 23 నది గండ భేరుండమునందు చెల్లును 23 రెండుసోలపద్మహస్తంబులు మొదకు సరిగాజేర్చిజూపినదది యవహిధహస్తంబగును 24 నదిశృంగార మగునాట్యమునందును విలాసార్థమగు బంతులాటయందును స్థనములయందును చెల్లును 24 దేవతులు గురువులుపండితులు యింకాయితరములను గూర్చియు దేనికిహస్తము లూహింపవల యునో వారుచేయు కార్యములను బట్టియు నివాసస్థానము జెండా చేష్టలు వాహనములు చేయుకార్యములు యింకాని తరకారణములు నూహించినందుకు నుపయుక్తములగు పైహ స్తములను జూపుచుండిన వారివారి హస్తములగును నవి అర్థా ను గుణములుగా నుండవలయును 40

సీ. అంగుష్టమాదిగా నగునంగుళంబులు
వరవిప్రరాజన్య వైశ్యశూద్ర
సంకరజాతినాసమ్మతంబగుచుండు
హస్తప్రధానాంగుళాదికమున
జాతిభేధంబులన్జాంగిహస్తంబులు
ప్రస్థరిల్లునువైదుప్రాణములను
గీ. అట్టిహస్తంబులందగు నంశములను
హస్తభాషానుసరణుల నరయునట్టి
ప్రాజ్ఞులనదగువిబుధలబాప్తివలన
కరకనుగుణముగ బేర్లుగలుగుసాంబా 41

తా. బొటనవ్రేలుమొదలునైదువ్రేళ్ళును వరుసగా బ్రహ్మక్షత్రియవై శ్యశూద్ర సంకర జాతులనంబడును హస్తములయందు ప్రధానమగు

వ్రేళ్ళచేత హస్తములజాతులు దెలుసుకొన నగునుఅట్టి హస్తము
నైదు ప్రాణములచేతమాత్రము ప్రస్తరింపబడును వుపప్రాణ
ములు ప్రాణములనే ననుసరించును చిహ్నప్రాణపత్రార్థటీకా
ప్రాణములు ప్రస్తారయోగ్యములుగావు అట్టిప్రస్తారమునందలి
గుర్తులు ప్రాణసంఖ్యములుగాను హస్తగుణములగుర్తులు లఘుప్లు
తరీతిగాను నుంచి ప్రస్తరింపవలయును అట్లుప్రస్తరింపగా నగు
హస్తంబులయందలి వుపయోగములను హస్తభాషానురీతులననె
గియుంచుబండితులయొక్క సహవాసమువల్ల నుపయోగముల
ను దగియుంచునట్టిపేరులు బెట్టుకుని వాడుకొనవలయును వుదా
హరణము ద్వాదశ ప్రాణములలోను మొదటిదగు. ప్రసారణ
ప్రాణమును రెండవదియగు కుంచితప్రాణముచేత ప్రస్తరించి
కనుబరుచుచున్నాను నారీతిగా మిగిలిననాలుగు ప్రాణములకు
బరస్పర భేదంబులూహింపవలయును ప్రస్తారమునకు గురుతులు
ప్రసారణమునకు (।) నిడుపగీటులు కుంచితమునకు ◡ అర్ధచం
ద్రాకారముగాను యుండును 40

| సంఖ్య | అంగుష్ఠము | తర్జని | మధ్యమము | అనామిక | కనిష్ఠ | పేర్లు |
|---|---|---|---|---|---|---|
| 1 | 1 | 1 | 1 | 1 | 1 | ఉభయము |
| 2 | ◡ | 1 | 1 | 1 | 1 | పతాకము |
| 3 | 1 | ◡ | 1 | 1 | 1 | వాయుహస్త |
| 4 | ◡ | ◡ | 1 | 1 | 1 | అరాళము |
| 5 | 1 | 1 | ◡ | 1 | 1 | ఐరావతము |
| 6 | ◡ | 1 | ◡ | 1 | 1 | భృంగము |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 7 | 1 | ◡ | ◡ | 1 | 1 | ఖంజరీటము |
| 8 | ◡ | ◡ | ◡ | 1 | 1 | కటకాముఖ |
| 9 | 1 | 1 | 1 | ◡ | 1 | భ్రమరికా |
| 10 | ◡ | 1 | 1 | ◡ | 1 | తృపతాకము |
| 11 | 1 | ◡ | 1 | ◡ | 1 | విహంగము |
| 12 | ◡ | ◡ | 1 | ◡ | 1 | మర్కటము |
| 13 | 1 | 1 | ◡ | ◡ | 1 | నిర్థళితము |
| 14 | ◡ | 1 | ◡ | ◡ | 1 | శింహ్వాము |
| 15 | 1 | ◡ | ◡ | ◡ | 1 | జింక |
| 16 | ◡ | ◡ | ◡ | ◡ | 1 | మరుబాణం |
| 17 | 1 | 1 | 1 | 1 | ◡ | చిరుపల్లవము |
| 18 | ◡ | 1 | 1 | 1 | ◡ | త్రిశూలము |
| 19 | 1 | ◡ | 1 | 1 | ◡ | వాయసము |
| 20 | ◡ | ◡ | 1 | 1 | ◡ | కుకుందము |
| 21 | 1 | 1 | ◡ | 1 | ◡ | వజ్రశృంగము |
| 22 | ◡ | 1 | ◡ | 1 | ◡ | గోధిహస్థం |
| 23 | 1 | ◡ | ◡ | 1 | ◡ | నీచాలనము |
| 24 | ◡ | ◡ | ◡ | 1 | ◡ | బెబ్బులిహస్థ |
| 25 | 1 | 1 | 1 | ◡ | ◡ | క్రకచము |
| 26 | ◡ | 1 | 1 | ◡ | ◡ | అర్ధపతాకము |
| 27 | 1 | ◡ | 1 | ◡ | ◡ | జలూకము |
| 28 | ◡ | ◡ | 1 | ◡ | ◡ | మకరము |
| 29 | 1 | 1 | ◡ | ◡ | ◡ | చంద్రకళా |
| 30 | ◡ | 1 | ◡ | ◡ | ◡ | సూచిహస్థం |
| 31 | 1 | ◡ | ◡ | ◡ | ◡ | శిఖరము |
| | ◡ | ◡ | ◡ | ◡ | ◡ | పూర్ణనాభము |

అభయపతాక వాయవయరాళోర్ణావ
తముభృంగఖంజరీటంబుకటక
ముఖఛురీత్రిపతాకమునువిహంగముమర్క-
టమునిర్ధళితవనాటములరేడు
జింకయు మరుబాణ చిరుపల్లవత్రిశూల
వాయసంబుకుకుందవజ్రశృంగ
గోధినీచాలసగురు శరభంబుక్ర
కచమర్ధమగుబతాకముజలూక
గీ. మకరచంద్రకళాహస్థ మరయసూచి
శిఖరమునువూర్ణనాభము ల్వెల్వామిగారి
ముప్పదియురెండుహస్థముల్మగినముగోడ
కుంచితప్రసారణంబులుగూర్పసాంబా 42

తా. ప్రసారణప్రాణమును కుంచితప్రాణము చేతప్రస్థరించినయడల 32 అసంయుతహస్థములు బుట్టును వానినామంబులు ప్రస్థార పంక్తులు పైచక్రమున వివరింపబడియున్నవి పైరీతిగా ప్రసారణపుంఖితములు ప్రస్థరించిన 32 ప్రసారణ ఆవేష్టితములు ప్రస్థరించిన 32ను ప్రసారణ ప్రేరితములు ప్రస్థరించిన 32 వెరశి 128 అను లోమసంయుత ములువిలోమ సంయుతలు 128 వెరశి 256 అసంయుత హస్థములు బుట్టెటు గ్రంథవిస్థారభీతిచే సంక్షేపింపబడెను 42

సీ. వృద్ధిష్టకరమునందూర్ధ్వ భాగంబున
ద్విగుణాంకములునిల్పిదేజరిల్లు
తొలిప్రాణసంఖ్యల తోడరిమొత్తము జేసి
నందుపైనొక్కటినమరగూర్ప

ప్రస్తారపంక్తిని బ్రబలు హస్తంబగు
నుద్దిష్టములునిట్టులూహ్యమగును
నరయనష్టాంకంబు నర్థింపదొలివగు
నందొకటినిగూర్చి నరయనొనర్ప

గీ. మూరు ప్రాణంబులగునిట్టిమర్మములను
విబుధవరులకటాక్షసంవీక్షణమున
నితరమర్మంబులెల్లను నెరుగపలయు
పార్వతీచిత్తమోదమాంపాహిసాంబ 43

తా. హస్తోద్దిష్టప్రశ్నమనగా పైచక్రములో ప్రస్తారరీతిగా వేయు హస్తములయందు దనకిష్టమగు హస్తమునిచ్చి యిది ప్రస్తారహస్తములలోయన్నవహస్తమని అడుగునప్పుడుయీహస్తముపైనివరుసగా 1 2 4 8 16 యీఅంకెలు వేశినందుదోలిప్రాణంబులపైనుండు సంకములు గూడిమొత్తముచేయగా వచ్చెడిసంఖ్యగల హస్తమునిదియని చెప్పవలయును నష్టప్రశ్నము అనగా యిన్నో హస్తమెట్లుయుండునని యడుగగా నాసంఖ్యను సగముచేయగా నదిదోలి ప్రాణసంఖ్యయగును పటుగానిచోనందు మరియొకటి గూర్చియరచేయ రెండవ ప్రాణసంఖ్యమగును వుదాహరణము పైప్రసారణ ప్రాణమును కుంచితప్రాణముచే ప్రస్తరించిన 32 హస్తములుబుట్టును అందు 15 హస్తమెట్లుండునని నడుగగా ఆది బేశిసంఖ్యగనుక సగముగా నెరదు అందుమరియొకటి జేర్చిన 16 నగును నదిసగముజేసిన 8 వచ్చును గనుక మొదటిది అంగుష్టము ప్రసారణ చిహ్నముగలదగును అనంతరమున యెనిమిదిని సగము చేసిన 4 వచ్చునుగనుక తర్జనవ్రేలు కుంచితప్రాణముగలదగును అటువలెనె 4 సగముజేయ రెండువచ్చునుగనుక మధ్యమము

సు కుంచితప్రాణమునే చంద్రునకటువలెనె అనామికయుకుం చితప్రాణమాయెను అంకస్థానమున నొకటియున్న దిగనుకనందు మరియొకటి గూడిన రెండువచ్చును నదియర చేయ్యి నొకటియ గును గనుకకనిష్టికప్రసారణప్రాణమునుపొందెనుఅంగసంఖ్యలు 1-◡-◡-◡-1వచ్చును ఈవిధస్వర తాళప్రస్థారములయందును బనికివచ్చును వీనికెవృద్ధిక్రమము కుంచిత ప్రాణములపైనున్న యంకములుగూడిన 14 వచ్చును నందున నకటిచేర్చిన 15వచ్చు నుగనుక పది హేనోహస్థమని తెలియును యీరీతిగనంతటను గ్రహింపవలయు 43

సీ. సదనులంబగుకర సముదాయముల కెల్ల
స్థాన బేదమునిట్లనంమదంబు
దలకుపై భాగంబుదగ జేర్పగానగు
చంద్రతోరణవోమ చరములందు
నాకవియచ్చరీనగపయోదములందు
పూర్వజన్మచ్యుతి నుప్పనుటందు
నిటలతటంబందునిడసగుప్రారబ్ద
నిజప్రమాణములందు నేర్పగాను
గీ. ముఖమునందును దలప్రాతమూర్ధ్నలందు
శ్రోత్రములశృతిచయప్రియుస్తూక్తులందు
నాశికంబుననాశ్చర్యసనటలందు
నోటియందదివర్ధన నొప్పసాంబ 44

తా. సమస్థమగు హస్థములకుతదుక్తార్థనిష్పాదకంబగు స్థాన బేదంబు లచే రసస్ఫులనంబు గాకుండునట్లున్ నియమంబులు బూర్వభర తాచార్యులచే విధింపబడెను నవియట్లన్న చంద్రునియందును

ధ్వజమునందును ఆకాశమున సంచరించు గ్రహనక్షత్రవిహంగాదు
లందును పూర్వజన్మజ్ఞానమును బలుకుటయందును వాటివాటికి
జప్పంబడు హస్తంబులెల్లను దనదలకు పైభాగంబునందు జేర్చిజూ
పందగును ఆరీతిగానే ప్రారబ్ధంబునందును ప్రమాణము చేయు
టయందును నడినెత్తియందు జేర్చి చూపందగును దనదల వ్రాత
యందును మూర్ఛయందును ముఖమునందు జేర్పవలయును
వేదశాస్త్ర పురాణేతిహాస స్మృతివినోదాదు లాలించుటయం
దును ప్రియుని వాక్యంబుల వినుట మొదలగువాటియందు
చెవులయందును నాశ్చర్యమును చెందుటయందు నాశికయం
దును ఆదిక్షాడదనుటయందు నోటియందును హస్తంబుల జేర్చి
చూపవలయును 43

సీ. చెక్కిళ్ల శృంగార చెర్యజూపుటలందు
            చుబుకంబునను దుఃఖసూచనందు
కంఠంబునను బాలగళవిదారిణలందు
            మంగళసూత్రసన్మానమందు
పురమునదన ప్రాణఘాతఘటనమందు
            బలికుతూహలములు బలుకుటందు
కుపితగర్వవిషాదకుచభూషణములందు
            ప్రాణపదం బెడబాయుటందు
    గీ. బాహుమూలంబునను మోహబటలమందు
        పార్శ్వములసహచర భ్రాతృబహుళశిప్రల
        నికటనిరుపద్రవములందు నేర్పుటందు
        నుదరమున బుత్రపాత్ర్యలందొప్పసాంబ. 45

తా. శృంగార చర్యలజూపుటయందు చెక్కిళ్లయందును దుఃఖసూచకము

నందు గడ్డమునందును త్రాడునే నురివేయుటయందును గోంత్తుక కోయుటయందును మంగళసూత్రమును ముడివేయుటయందు ను బహుమానమును చేయుటయందు వేయు పుష్పదామబన్న సగములనర్పించుటందు కరమునందును దసమనోభిలాషమును చెప్పుటయందును సఖునిసంతోషచర్యలు చెప్పుటయందును, కుచ్ఛితమునందును గర్వమునందును దుఃఖమునందును స్థనఅలం కారాదులందును ప్రాణపదంబెడ భాయుటయందును నతుమున జేర్పవలయును. మోహపటలమందు బాహుమూలములయం దును స్నేహితులయందును తోబుట్టువులయందును అనేకమను టను విశాలమునందును సమీపమునందును భయములేదనుట యందును నో కరికిసేర్పుటయందును శౌర్యములను జేర్పవల యును బుత్రునందును పౌత్రులందును కడుపునందు జూప వలయును. 45

సీ. కటియందు వాహన కనకపీఠములందు
క్రిందికదోలోకికినుకలందు
ముందుకుతత్కాలమునగూర్చి విధులందు,
వెనుకకుగత కథావిధులయందు
స్వైకిరాబోయెడి బలునర్తనములందు
శౌర్యంబులనుజ్ఞాప్తి బలమునందు
వెనుకకుముందుకు వికలవిహ్వాలమందు
క్రిందికిమీదికి కినుకయందు.

గీ. తత్తదుక్తంబుల[illegible] హా[illegible]తతులగూర్ప
రసము భిన్నంబుగాకనుర క్తిగల్గి

బుడమిబురుషార్థములబొందబోలునంచు
నారదునకును బలికెను నలువసాంబా 46

తా. వాహనమునందును పీఠమునందును కటిప్రదేశమునందు జేర్పవ లయునునరకమునందు దుఃఖమునందుక్రిందునకును వర్తమానా ర్థములయందు ముందునకును గతకాలార్థ ములందు వెనుకకు నుముందురాబోవు ననెడియనేకార్థములయందు పైభాగము నందును జ్ఞప్తితో బలుకుటయందు ప్రక్కల యందును మతి చెడుటయందును దేహమునుగుర్తెరుగక యుండుటయందు వెనుకముందులకున్ను, విచాలమునందు క్రిందుమీదులకున్న వాటివాటికి చెప్పబడుహస్తములు జేర్చి చూపిన రసము భంగ ము చెందక వినోదకరములై బురుషార్థసిద్ధిని భూమియందు బొందగలరని నారదునకు బ్రహ్మదేవుడు జెప్పెను

యిది శ్రీ భరద్వాజ సగోత్రోద్భవ వేదుల యజ్ఞేశ్వ
తనూ భవ సీతారామ శాస్త్రివిరచితంబగు భరత
సంగ్రహంబునందు తదుక్త సంగ్రహ
టీకా సమేతంబుగాభావా
ధ్యాయమునందు
హస్తప్రకర
ణంబు
సంపూర్ణము





# రసప్రకరణము.

## నాయికాలక్షణములు.

అగయరసాలంబమగు స్త్రీలుబురుషుల
  కును నాయికానాయకులనదగును
బంధింపంబడనను రాగ నతిస్త్రీయనగు స్వకీయ
  బరబురుషానురాగ భరిత పరకీయ
నంకురయవ్వనయగు ముగ్ధ యగుసమాన
  ప్రౌఢ మదనమధ్యవివిధప్రగల్భ
కేళీకళాపాను కృతిదానైపుంగని
  తారుణ్యాయవిహీత తన్వియంద్రు

గీ. యవ్వనసమన్వితయుజ్ఞాత యవ్వనియగు
  భయముప్రౌఢాస్యగతిపతి భరనవోఢ
  యండవిస్రబ్ధయునవోఢయగునుకొంత
  పరిచయంబునుగలిగియు పరగసాంబా 47

నవరసంబులకు నాలంబనోద్భూతములగు స్త్రీలు బురుషులు నాయికా నాయకులగుదురు నందు పతియందు ననురాగము గలది స్వీయయగును బరబురుషులయందు గలననురాగమును నన్యులకు దెలియనియ్యక గూఢమగు ప్రవర్తనముగలది పరకీయయగును నందునంకురమగు యవ్వనముగలది ముగ్ధయగును సిగ్గు లేనిశిగ్గుమదముగలుగునది మధ్యమయగును కేళీవిలాస

ములయందలి నేర్పుగలది ప్రగల్భయగును తనుగుర్తెఱుంగని
యవ్వనముగలది అజ్ఞాతయవ్వన యగును తెలియునట్టి యవ్వ
నముగలది జ్ఞాతయవ్వనయగును భయము సిగ్గుపరాదీనము
గలిగి పతిచే భరియింపబడునది నవోఢయగును పైలక్షణము
లలో కొన్ని మాత్రము గలుగునది విస్రబ్ధనవోఢ యగును 47

సీ. పగసతీరతుడగు పతియందుసతము
ధ్యాధీరపరుషవ్యం జ్ఞ్యములువల్క
మధ్యధీరాధీర మరియశ్రుబల్కుయ
వ్యజ్ఞ్యకోపోపేత యగుచునుండు
నిరువురులోదనహీనత నెరుగుపై
నములక్షణయును జేష్ఠాకనిష్ఠ
యన్యస్త్రీసంభోగియగు పతిన్ గనుగొని
రత్యుదాసీనధీరప్రగల్భ
గీ. నష్టపతియందుతాడనహాటనములను
గవళగాపించునదియధీరప్రగల్భ
గమ్యాదుగగుణాధీరధీ రప్రగల్భ
నదియు జేష్ఠకనిష్ఠన న్నలగుసాంభా 48

తా. పగసతీ సంభోగము గలపతియందు కఠినమగు ధ్వనితోచు
వాక్యములు బలుకునది మధ్యాధీరయగును పైరీతిగ బల్కుచు
గూఢము లేని కోపముకలది మధ్యాధీరా ధీరయగును యిరువురి
లోను తనకగు తక్కువను దెలసి పైలక్షణంబులతో గూడునది
న్యూనాధికములనుబట్టి జ్యేష్ఠాకనిష్ఠ యనబడును అన్యస్త్రీసం
భోగముగల పతినిజూచి రతియందు వుదాసీనముగలది ధీరప్రగ
ల్భయగును నాప్రకారమగు పతినిజూచికొట్టుట నిరోధించుట

మొదలగునవి చేయునది యధీరప్రగల్భయగును పై రెండులక్ష
ణములతోఁగూడునది ధీరాధీరప్రగల్భ యగును ఆదియును
న్యూనాతిశయములచేత జ్యేష్ఠాకనిష్ఠా భేదములను పొందును 48

సీ. అవివాహితయునయ్యు నదితల్లిదండ్రుల
యాధీనజారిణి యగును కన్య
పరిణయమగునట్టి పరపురుషానుభో
గినిపరోఢయనంగ గీర్తిచెందు
సురతగోపనగుప్త సుగతాగతావర్త
మాన భేదంబుల మఱిద్రివిధము
దనయభిప్రాయంబు దపులువానికిదక్క
నెరుగనియ్యనిదను చేయువిదగ్ధ

గీ. నదికియావాక్యచతురతకానటంచు
లక్షితయనంగ బయలగునట్టిసురత
వ్యాపకాంచితయనగను వ్యాప్తమగును
కులటబహుపురుషులతోడ గూడసాంబ 48

తా. వివాహములేక తల్లిదండ్రుల స్వాధీనమునందుండి జారత్వము
చేయుచుండునది పరోఢయగును సురతగోపన గుప్తయు ఆగత
ము అనాగతము వర్తమానము అనుమూడువిధంబులు దనను
నోగత మగుయభిప్రాయమును దనప్రియునకు దక్కనితరుల
కు దెలియనియ్యనిది విదగ్ధయగును మఱియు నది క్రియావిదగ్ధ
వాక్యచతురవిదగ్ధయని రెండువిధములు కొంతకొంతబయలగు
నట్టిసురతవ్యాపకము గలది లక్షితయగును బహుపురుషాను
రాగముగలిగి ప్రవర్తించు నదికులటయనబడును 48

సీ. తనదుసంకేతమా తలసిర్ణోకతగూర్చి
నాలోచనముచేయు ననుశయాన
నదిభావ్యసందర్భ వర్తమానములండ్రు
దనతరిజారబోధనయుముదిత
పతిసమీపమునుత పతిగూడి క్రీడింప
బలసాహసికప్రతి భాచతురయు
తనరంకుకొంచము దగబయల్పడినను
సమయోచితగ్గోప్య సమర్థకగును

గీ. తంద్రచేతనుతనజారి తనముబల్కి-
రోదనాదులదనయందు రోషమడిగి
కనికరముబుట్టబతిమది గరుగజేయు
గాంతనపలాపచతుర నగుచుపొంగా

తా. తనదు సంకేతస్థలమును నరికట్టుటచేత యాలోచించునది య
నుశయాన యగును నది భావియనుశయాన ఆసందర్భఅనుశ
యాన వర్తమానయనుశయాన యని మూడువిధములు తన
సమయమును జారునకు బోధించునది ముదితయగును తనజార
తనము కొంచము బయలగునప్పుడు సమయోచితముగా గోప్య
పరచుసామర్థ్యము గలది ప్రతిభా చతురగును తనజారత్వము
భయముచే చెప్పియును రోదనాచులచేత తనయందు కనికరము
బుట్టునట్టుబతిమనస్సును గరిగించునదినపలాపచతురయగును. 50

సీ. సాక్షాన్మద్రవ్యాను సంగతిగాబహుపురు
షానురాగిణియన నమ్మతిల్లు

నదివివాహితగాని యదిజాతిసామాన్య
గలవివాహిత్యయున గంతుకగును
గూఢసామాన్యన ఖుడుగతించిన వెన్క
నట్టివ్యాపకమున నలరునదియు
బతిసాధ్యస్వాధీన పతికనంగను చెల్లు
వాసకసజ్జికా వచ్చుప్రియున

గీ. కనుగుణంబుగ కేళిగృ హంబునాత్మ
లనుసలంకారముగ జేసి నలరుచుండ
పతియురాసందులకుమది పరితపింప
విరహావుత్కంఠి తసనది నెలయుసాంబా 51

తా. ద్రవ్యమునాశ్రయించి బహుపురుషులయందు ననురాగముగలది సామాన్యనాయిక యగును సందువివాహము లేనిది జాతిసామాన్య యనియును వివాహముగలది స్వైరిణిగా బ్రవర్తించు నేని యగంతుకసామాన్య యనియును వివాహముగలిగి మగడుచని పోయిన వేనక స్వైరిణులతో బ్రవర్తించునది గూఢసామాన్యయనియును చెప్పబడును పతినిస్వాధీనము జేసుకొను స్త్రీ స్వాధీనపతికయగును వచ్చుప్రియునకు దగునట్లు కేళిగృహంబును దనశరీరమును నలంకరించుకొని సంతోషముతో నెదురుచూచుచుండునది వాసకసజ్జిక యనంబడును పతిరాకం బునకు మనంబున దుఃఖించుచున్నయది విరహోత్కంఠితయ నంబడును 51

సీ. సంకేతమగుచోట సఖునిగానక గుంద
నదివిప్రలబ్ధయనంగ నొప్పు

నటురాగరశియాం నదించునదిసమా
గఛత్ప్రతికయన గణనచెందు

గీ. నన్యసతులనుగూడిన యనుగుజూచి
కోపఘూర్ణితయగుదాని కోమరుగాంచి
ప్రియుడులాలింప శాంతిలు ప్రీతచిత్త
నరయలఘుమానవతియన నగునుసాంబా 53

తా. దనప్రియుడు నూరునకుబోవునని ముందురాబోవు విరహమును గూర్చి దుఃఖించునదిగ ఛత్ప్రతికయగును నాప్రకారము మగడు నూరునకుబోవ జూచి రాబోవుమన్మథ బాధలచే విరహాదుల దుఃఖించునదిగ ఛత్ప్రతిక యగును దనపతి దేశాంతరమునుండి రాగలడని సంతోషించునది అగమిష్యత్ప్రతిక యగును ఆప్రకారముగా రాజూచి ఆనందించునది సమాగఛత్ప్రతిక యగును అన్యస్త్రీలతోగూడియున్న పతిపై కోపముచేత గలుగుదానిరీతి జూచిప్రియుడు లాలనసేయుటచేత శాంతించి ప్రియముగల చిత్తముగలది లఘుమానవతి యనంబడును 53

సీ. బరసతీనామంబు బలికినపతిపైని
కోపితయగుదాని కోమరుగాంచి
యూనబెట్టుటచేత నింపశాంతియునొంద
మధ్యమానయనంగ మరిజలంగు
చిహ్నలన్నను గోప చిహ్నతపాదప్ప
ణాంకులుగురుమానమంచునగవని
తృష్టయతృష్టతృప్తాతృష్టలనమాను
దెనవులనుందురు దెరవలెల్ల.

గీ. సందుగర్వితలెన్నంగ నైదుగురగు
రూపతారుణ్యవిద్యావిరూఢగతుల
ప్రేమయుక్తిమానములచేత బెంపుచెందు
నందువక్రోక్తులొకతరి నగునుసాంబ! 54

తా. బరసతీనామంబు బలుకు బతిపైని కోపించు నాయికను జూచి నాయకుడు ప్రమాణాదులనుచేయుటచేత శాంతించునది మధ్యమానయగును పరసతీరతుడగు నాయకుని చిహ్నములుజూచి కోపోద్దీపితురాలగు నాయిక పాదంబులపైబడి నాయకుడు ప్రార్థించుటాదియగునవి గురుమానమనంబడును నాయకుని వలనపూర్ణముగా తృప్తినొందునది తృప్తయనియు తృప్తిలేనిది అతృప్తయనియు నొకప్పుడు తృప్తియు నొకప్పుడు అతృప్తియు గలుగునది తృప్తాతృప్తయనియు. సకలమగు స్త్రీలు మూడు విధములుగా నుందురు. అందుగర్వితలు నైదు విధములుగా నుందురు 1 రూపగర్విత 2 యవ్వనగర్విత 3 విద్యాగర్విత 4 విరూఢగర్విత 5 ప్రేమగర్విత అందుక్రమములగు బలుకులు వక్రా నొకప్పుడు గలుగును. 54

సీ. పతిపరసతికిలోబడదాని చిహ్నము
ల్గనిగుందు డెందముగలుగనన్య
సంభోగఖేదనం సమ్మతిల్లునుదాని
దాశిగానగుటయు దగునటండ్రు
వక్రోక్తులనునొప్పవలయు నొక్కొకతరి
ప్రియుడప్రియముసేయ ప్రియముసేయు
న[illegible]నుత్తమప్రియునకు దగురీతుల
మారుసేయుచునుండ మధ్యమయగు.

గీ. సధవ ప్రియునకు హితంబులు సనాచరింప
దివిరహితవుగ వర్తిలదివ్యదివ్య
దివ్యజాదివ్యలనగను దేజరిలుదు
రందు భేదంబులూహ్యంబులగును సాంబా. 55

తా. దనబతి బరసతితో గూడిన దాని చిహ్నములు జూచి విచారించు నది సవ్యసంభోగదుఃఖిత యగును నట్లుగాకున్నది దనదాశీయగు టయు గలదనందు వక్రమగువాక్యలు వికల్పముగా వచ్చును ప్రియుడు దనకు ప్రియము జేసినను దాను ప్రియము సేయునది యుత్తమనాయిక యగును ప్రియుని హితాహితంబులకు మాను సేయునది మధ్యమనాయికయగును ప్రియుడు హితవు జేసినను దాననహితవు గావించునది అధమనాయిక యగును దేవతా స్త్రీలు దివ్యలనియును మానవస్త్రీలు అదివ్యలనియును దేవతా స్త్రీలకు మానవులకు బుట్టువారు దివ్యజాదివ్యలనియును చెప్ప బడుదురు వుదాహరణము పద్మాధిని దమయంతి శకుంతల మొ దలగునవి 55

సీ. యిలపద్మినీ చిత్తినీ శంఖినీ హస్తి
నులుశశవృషమృగాశ్వులనుగూడ
బహుశ్వీయ్యసామాన్య బరకియ్యలనవ
స్థాభేదములన వాంతరితలగును
తగకలహాంతరితయు మొదల్ఖండితా
వస్థచేగోపింపవాడుజనిన
తరవిరహోత్కంఠతను జెందురీతిగా
వెసనభిసారికావిప్రలబ్ధ

గీ. గానసీయవస్థాభేదగతులగణన
చేష్టల ప్రసనములయందు చెల్లుచుండు
భేదము లెఱింగి వేరులు వేరుకొనగ
నగునటంచును శాస్త్రజ్ఞులనిరి సాంబ 56

తా. భూమియందు పద్మిని చిత్తిని శంఖిని హస్తినీలను నాలుగుజాతుల స్త్రీలువరుసగా శశవృషమృగహయ జాతులను నాలుగుజాతులపురుషులనుగూడుటయందుప్రియముగలవారలై యుందురు వారు స్వీయాసామాన్య పరకీయయును నవస్థాభేదములచే నవాంతరత్వమును పొందుదురు మఱియు కలహాంతరిత ఖండితావస్థచే కోపింపగా భర్తజనిన వెనుక విరహోత్కంఠతను పొందునట్లు అభిసారిక విప్రలబ్ధయు నగును గనుక నీయవస్థాభేదముల యొక్క మార్గములు చేష్టలయందును రసములయందును చెల్లును అనగా నీభేదములు తత్తత్కాలాను సరణిగా నూహించి వాడుకొనవనయు ననుట యిదియె విద్వాంసులయొక్క అభిప్రాయము. 65

—*నాయకలక్షణములు*—

సీ. ధైర్యకృపాసత్యదార్ఢ్యదేహోదారు
డగును ధీరోదాత్తు డనగ జగతి
దర్పమాత్సర్యభేదకదక్షుడగువాడు
ధీరోద్ధతుండన దేజరిల్లు
ధీరశాంతుండగు ధీయుతశాంతుండు
ధీరలలితుడ్త్యాగదీపితుండు
నిట్టివాండ్రకుగార్యనిపుణత్వచతురులౌ
**నలుపురునసుగుణులునగుదురందు**

గీ. కుపితయగు నాయకకు బ్రేమ గుదురఁ జేయు
పీఠమర్దుండు నొకవిద్యప్రీతుఁడగును
విటుఁడు చేటుఁడు సంధానవిహ్వలుండు
దూషకవిదూషకాఖ్యలఁ దొడరు సాంబ

తా. ధైర్యము దయా సత్యము దృఢదేహము మనోబలము గలవాడు ధీరోదాత్త నాయకుండగును దర్పము మాత్సర్యము మాయా సమర్థత్వము గలవాడు ధీరోద్ధత నాయకుండగును శాంతము బుద్ధియు గలవాడు ధీరశాంతుండగును సకలభోగ సమన్వితుడు ధీరలలితుడగును నీ నాయకులకు గార్యనిర్వాహకులగు పలువురు మిత్రులుగలరు అందు కుపితయగు నాయికకు నాయకుని యందు ప్రేమగుదురఁ జేయువాడు పీఠమర్దుండనబడును యేకవిద్యా ప్రియముగలుగువాడు విటుడనంబడును. సంధాన చాతుర్యముగలవాడు చేటుడనంబడును. దూషణస్వభావము గలవాడు విదూషకుండనంబడును. 57

సీ. అన్యోన్యసందేశ మమరఁ గూర్చును దూతి
మఱి దాశి దాశి సమానగుణశ్రీ
ప్రియుని యొద్దకుఁ బోవ ప్రేరేపణము సేయు
వేలదుకయగు ప్రాతివేశినియును
సైరంధ్రి సాధ్వియై సామంతనృపవధూ
రంజితాలంకార రమణిచతుర
పతికనుకూలవతా పద్ధతుల్గర పెడి
పణతిశిక్షికయును బరగుచుండు.

గీ. చతురసంధానచేటినా చెల్లుదాది
బాలధాత్రియిలింగి నివ్యాజయోగ

చేతశిల్పిని శిల్పినీ చెటిహాస్య
నర్మసఖినర్మసఖి యననగునుసాంబా 58

తా. పరస్పర సందేశమును గూర్చునది దూతికయగును. నౌఖరీ జేయునది దాశీయగును గనతోసమానురాలు సఖియగును ప్రియునియొద్దకుబోవ ప్రేరేపణముచేయు బోరుగింటిది ప్రాతి వేశినియగును సంసారిగానుండి సామంత్రరాజ కాంతలు సంత్రింపనలంకారములను జేయుచుండునది సైరంధ్రియగును పతికి అనుకూల మార్గములను వుపదేశించునది శిక్షికయగును సంధానచతురతగలది చేటియగును దన్ను బెంచు దాశీబుత్రి ధాత్రేయియగును గపటయోగ చాతుర్యముగలది లింగనియగును గృహమున చిత్రకర్మలు జేయునది శిల్పినియగును పరిహాసములు బలుకునది హాస్యయగును మిక్కిలి వినయవిధేయములు గలుగునది నర్మసఖియగును. 58

సీ. యేకపత్నిప్రతుండిలననుకూలుండు
దాక్షిణుండగు వనితాసముండు
యపరాధియగుచన్ను నదివెళ్ళగొట్టిన
న్బెకదృష్టుడు ప్రియంబోలుకబలుకు
గపటము జేయునంగనల శఠుండుప
పతివిటుండగు పతిపరిణయుండు
ప్రియురాలునలిగిన ప్రియము నుత్తముడౌను
మాయగోపితుడగుమద్యముండు

గీ. భయగృపాలజ్జలను దానుబారదోలు
కాముక్రీడవిచారణాకరుడధముడు

తనకు భేదమవస్థాంతరగతులను
యీర్ష్యమానాదులును లేవు యింకుసాంభా 59

తా. యేకపత్నీవ్రతముగలుగువాడు అనుకూలనాయకుం డనబడును అనేకులగు స్త్రీలయందు సమానమగు నభిప్రాయంబు గలుగువాడు దక్షిణనాయకుండనబడును అపరాధ్యుడైన దన్ను నాయిక వెళ్ళగొట్టినను తానుబోక ప్రియవాక్యములు బలుకువాడు ధృష్టుడనంబడును స్త్రీలయందు గపటము జేయువాడు శఠుండన బడును జారుడు వృషలి యనంబడును వివాహము జేసుకున్న వాడు పతియనంబడును ప్రియురాలు దన్నెపైని నలిగినను దాను ప్రియమునే జేయువాడు వృత్తము డనంబడును గపటముగాన రాకుండునట్లు సంచరించువాడు మధ్యముండనంబడును భయము దయాశిగ్గు లేనివాడై కామక్రీడాప్రధానము గలవాడు యధముడనంబడును అవస్థలకు నవాంతరత్వములు గలుగును యీర్ష్యామానాదులు యింక గలుగనేరవు 59

సీ. రతిహాస్యశాంతవీరాద్భుతరౌద్రక
సాభయానకముభీభత్సములను
నవరసంబులునం దెసయును స్త్రీబురుషుల
కగుభోగగోర్కె కాంక్షరయరతియు
వికృతిదర్శనచిత్తవికసనహాస్యంబు
విబుధమిత్రవియోగవిరతిగిరణ
నం సేయునపచారమందు బుట్టినమనో
జ్వాలనంబుక్రోధమై జలగుచుండు

గీ. పొందదగనట్టి కార్యంబు బొందగోరు
టందుగలగోర్కె నుత్సాహమండ్రుబుధులు

క్రూరవాగ్రూపములఁ జూచి కెరలనర్థ
శంక యేభీతియన నతిశయిలుసాంబ 60

తా. శృంగారరసము హాస్యరసము శాంతరసము వీరరసము అద్భుత రసము రౌద్రరసము కరుణారసము భయానకరసము బీభత్స రసము అని నవరసములు గలవు అందు స్త్రీపురుషులకు గలుగు సంభోగకోర్కె శృంగారరస మనబడును వికృతిదరిశనము వలనగలుగు మనోవికసనము హాస్యరసమనబడును పండితుల యొక్కయు స్నేహితుల యొక్కయు వియోగమందు గలవిరతి కరుణారసమగును శత్రువులు జేయు నపచారమందు బుట్టిన మనస్సుయొక్క ప్రకాశము క్రోధమనబడును పొందుటకు నలవిగాని గార్యములను బొందగోరు గోర్కెయుత్సాహరస మగును క్రూరమగు వాక్యములు రూపములు వినుట చూచుట మొదలగువాటిచే గలుగుఅనర్థశంక భయానక రసమగును 60

సీ॥ గడురక్త మాంసాస్థిగముల జూచుటచేత
బరగసహ్యతయె బీభత్సమగును
అపకారములచేతనగు మనఃప్రజ్వల
నంబు రౌద్రవమనంగ నమరియుండు
మన్నించువస్తువుల్మాటలు వినిగన
చందుసంతోష మాశ్చర్యమగును
విషయవైరాగ్యముల్విస్తరిల్లగ జేయు
మానసనిశ్చయంబు నిరిశాంతి

గీ. అందురతియవ్వనము లెవ్వనాశ్రయించి
వచ్చుచున్నవో వారెయాలంబనములు

వృద్దీపనములు వసువర్యోత్ర్యాహాచేష్ట
లరిశుకపికాదులగు తటస్థములుసాంబా 61

తా. విశేషములగు రక్తమాంస అస్థిసముదాయములు జూచుటచే తగలుగు నసహ్యము భీభత్సరసంబనబడును అపచారములచే నైన మనస్సుయొక్క మంటయే రౌద్రరసంబనబడును గొప్ప జేయదగు వస్తువులు మాటలు గనుటచేతను వినుటచేతను నగుమనోల్లాసము హాశ్చర్య రసంబగును విషయములయందగు వైరాగ్యమును వృద్ధినొందసేయు మనోనిశ్చయము శాంతరసంబగును యిందుశృంగార రసప్రధానమగు యుస్వాసముగల నాయికా నాయకులు అలంబనమనంబడునురు నయస్సుధసముచే స్తానసమూహంబులు వృద్ధీపనములనంబడును కాలము చిలుకలు కోవిలలు మలయానిల చంద్రాదులు తటస్థము లనంబడును

సీ. భాసురంబైనవి భావాదికముచేత
గలరసముత్పన్న కలసచెంది
బాహ్యప్రకాశమై బరగుకటాక్షభ్యా
విక్షేపమనుభావ వితతులగను
నిష్క్రియాంగత్వంబు నెగడుస్తంభమనంగ
నతిమోహాతరమూర్ఛ మగుప్రళయము
కన్నీళ్ళకలచే గలగజృంభణమగు
జమటస్వేదమనంగజలగుచుండు
గీ. విమలకంపితస్వరమగు విస్వరంబు
నగునుపులకాంకురము రోమహర్షణంబు
వణుకుకంపము వెలివెలివర్ణమండ్రు
విడికకొందరుసాత్వికవితతిసాంబా 62

తా. ప్రకాశమానంబగు విభావాదికముచేత గలుగురసము వుత్పన్న
మై పైకిప్రకాశించును, కీగంటి ప్రసారములు భ్రూవిక్షేపములు
అనుభావసముదాయంబగును అంగముల యొక్కవ్యాపారరా.
హిత్యముస్తంభమనంబడును అతిమోహమున గలుగుమూర్ఛ
ప్రళయమగును కన్నీళ్ళు కలనజృంభణమగును చెమటస్వేద
మనబడును గద్గదస్వరము విస్వరమగును పులకాంకురము రో
మహర్షణమగును వొణుకుకంపమగును వెలవెలత్వము వివర్ణ
మగును యిందు కొందరు సాత్వీక సముదాయంబు
లేదని చెప్పిరి 62

సంచారిభావములు

సీ. విమలమైన రతేచ్ఛవిడివెలిగాకుండ
వెంటసంచారులై వెలయుచుండు
నవియుసంచారంబు లనబడుగొర్కెలే
కుంటనిర్వేదంబు కునుజలంగు
విరహమందగు స్వేదవితతిశ్రమంబగు
దగుబుద్ధిదేహభేదంబులనది
మదనాహులనుదీన మతివేడదన్యంబు
జాడ్యమేమియు జేయజాలకునికి
గీ. శక్తిలేనట్టి బడలికై జెల్లుగాని
త్రాసముతటస్థముఁలగనదపులుభయము.
తనమునోభీష్టతయు తటస్థంబుయగునో
కాదాయనుసంశయము శంకగునుసాంబా 63

తా. స్వచ్ఛమగు రతియందు కోర్కె భిన్నము గాకుండా వెంటనే సహచారులన బుట్టుచున్న యవి సంచారంబు లనబడును. యిష్టము లేక యుండుట నిర్వేద మగును విరహాద్యుద్భవమగు చెమట శ్రమమనబడును నది మానసకష్టము దేహకష్టము యని రెండు విధములు. దీనత్వముచేత మదనాదులను వేడు దైన్యమగును. యేమియు జేయజాలకుండుట జాడ్య మనబడును సక్తి లేని బడలికె గ్లానియగును మలయానిల చంద్రాదులను గన నగు భయము త్రాసమగును. దన మనస్సునగల గోరిక యగునో కాదోయను సందేయము శంకయనబడును. 63

సీ. మాత్సర్యంబున మునుకొను పీడార్తి
నపరాధ్యుపై కోప మగుయుగ్రోప
మగుగర్వ మొదవు నాభిమానమునమదో
ద్ధతచిత్త మౌన్నత్య తనబలంగు
గలుగు నిష్టాప్తిగములచే ననుమానో
వేడుకా వేశమూనే శమగును
మనము గృతార్థత్వ మగుం ధృతియగు
పూర్వానుభవదృష్టిపూర్తస్మృతి.

క. చపలమగు రాగజంబగు చర్యలెల్ల
నుగ్రతగు నెగ్గులగు రోషమున గలంగ
దనమనోభావములయందు దనరురూపు
మరుగు బగచుటయవహిత్థ మగునుసాంబా. 64

తా. మన్మథ జ్వరముచే గలుగు శరీరపీడ ఆర్తియనబడును అపరాధుల యందగు కోపము రోషమగును. యితరులు నాసరిగా రని మదముచే బుట్టిన మనస్సుయొక్క యౌన్నత్యము గర్వ

మగును. యిష్టాయిష్ట నిమిత్తాయములచే గలుగుచున్న మన స్సంతోషాతిశయము ఆవేశమగును మనస్సు కృతకృత్యతను పొందుటయే ధృతియగును. పూర్వానుభవమును జ్ఞాపకము జేసుకొనుట స్మృతియగును అనురాగమువల్ల బుట్టినచేష్టాసము దాయము చపల మగును యెగ్గుజేయుట చేత గలుగు కోపా తిశయము వుగ్రమగును దన మనోభావంబులయందు దవులు రూపమును మరుగు బరచుట అవహిత్థమగును. 64

సీ. త్రపమనస్సంశయ తగువిషాదమువివి
ధోపాయభంగమై దోచుమదము
నాసవపానాదులందు నోత్పన్నమౌ
మానసచలనసంభ్రమ మటండ్రు
సమయాక్షమత లేక సహదిజా గోర్వాము
నౌచుక్యగుణనిర్ణయంబగుమతి
నగుమాన పోన్మిల నమునిద్రయూగ్చవెా
హము మేలుకొనుట బోధగునుముదము

గీ. సిద్ధసంప్రాప్తి పలనగు నీప్సితంబు
జేయదగుగార్యములయందు జేయుగాల
యాపనాలస్యమగు నిద్రయనగసుప్తి
యధికసందేహము వితర్క మగునుసాంబా. 65

తా. మనస్సంశయమున నగుదుఃఖము త్రపయనంబడును. వివిధము లగు వుపాయ భంగము గలుగునది మద మనంబడును మద్య పానమునందు బుట్టిన మనస్సుయొక్క అస్థిరము సంభ్రమ మనంబడును సమయమునకు దగుశాంతి లేక నాలస్యమును నోర్వజాలక యుండుట ఔచ్చుక్య మనబడును అర్థనిర్ణయ

ము మఱియనబడును మనోక్లేశము నిద్రయనబడును మూర్ఛ
మోహమనబడును మేలు కోనుట బోధయగును యిష్ట సంప్రా
ప్తిచే గలుగు గోర్కె మే ముదమనంబడును. జేయదగు గార్య
ములయందు జేయుగాల యాపనము ఆలస్యమగును నిద్రయే
సుప్తియగును అధికమగు సందేహము వితర్కంబగును. 65

సీ. బహునాథకత నోర్వబడకుంట సూయగు
గార్యానుగత మతిగడగు ధ్యాస
సచరాచరజ్ఞాన సమితి సూన్యము భ్రమ
కామవికారాధికమప స్మృతి
యిన్నియు నొకచోట నెన్నడుగలుగవు
రసగుణాంచితముగా రమ్యమగును
నలరసాభిజ్ఞాన మనదగు భావంబు
హావమను ద్వ్యనమూ హావస్ఫుటనము.

గీ. భావప్రకటనమును హేలబాగుమీరు
ప్రియునిజూచిన స్త్రీలకు ప్రీతిచేత
లాలితంబగు చేష్ట విలాసమగును
దను ప్రకాశతమాధుర్యత యగు శోభా.

శా. అన్యుల యతిశయమును జూచి సహింపకుండుట అసూయ
యగును కార్యానుగతమగు బుద్ధి ధ్యాసయగును చేతనా
చేత నజ్ఞాన సూన్యము భ్రమయగును మదన వికారాతిశయము
అపస్మృతి యగును యీపైని వ్రాసిన సంచారీ భావంబులన్ని
యు నొకచోట నెన్నడు గలుగ నేరవు రసగుణాను సరణలుగా
ప్రకాశించును యీపై రసములు తెలుసుకొను యోగ్యతయే
భావమని బడును కొద్దిభావస్ఫుటనము హావమగును భావము

యొక్క ప్రకాశత్వముచేత, హేలయగును ప్రియులగను గోను
స్త్రీలకు ప్రీతిచేత ప్రకాశ మానంబగు చేష్టయే విలాసంబ
గును శరీర ప్రకాశ మానసము మాధుర్య మనబడును. 66.

సీ. గుణశీలములు దాటకునికి ధైర్యంబగు
  మదిచంచలము విభ్రమ మనబడును
బతికిష్టముగ దాను బ్రబలుట యేలీల
  కిలికించితము నుల్కి కినిశరోష
సంతోషహాసాటయు స్వరశీ బాష్పంబుల
  నించుటాదిగ నెలయించు చేష్ట
దనయిష్టమును కథాతతులంతో దెలుపగ
  మోట్టాయితము మోహ మొలుక నట్లు

గీ. సోయగపుమేని విన్యాససుందరంబు
లలితము భూషణము లల్పమైనగాని
దనుప్రకాశత విచ్ఛిత్తిధవుని కథల
యందు నిరసన బిబ్బోకమనిరి సాంబా. 67

తా. గుణశీలములు దాటకయుండుట ధైర్యంబగును. మనస్సు స్థిరము లేకయుండుట విభ్రమమగును ప్రియుని యిష్టముగా ప్రకాశించుట లీలయగును నులికిపడి సంతోషాను సరిణులచే బాష్పముల నించుటా మొదలగు చేష్టలుకిలి కించితమగును దన యభిప్రాయము కథలు మొదలగు వాటిచే దెలుపుట మోట్టాయితమగును మోహ మొలుకునట్లు సుందరమగు శరీర విన్యాసము సుందర మగును ఆభరణము లల్పము లైనను దను ప్రకాశించుట విచ్ఛిత్తియగును. దనపతియొక్క కథలయందు నిరసనము బిబ్బోక మగును. 67

సీ. తనదు సంకేతార తనువెల్లు తత్పూర
కుండి క్రియతో నూలుకోన విహ్వాతము
తన మౌగ్ధ్యతనము చే తగుభీతిచకితము
హసితము మోదాగ్రహమైననవ్వు
దనుమననము చేత దంతక్షతాదుల
గురు తెరుంగక యుంటకుట్టమితము
ప్రియు విషయంబగు ప్రేమమోహాదుల
చపలతకుతుకమై చెల్లుచుండు
గీ. ప్రీతితో జూచునది నేత్రప్రీతియగును
సంఘటనకూర్చ యగుదుఃఖ సమితిచింత
యేకనిష్ఠిత ధ్యానము హింసస్మృతి
బలిసుగుణ కీర్తనము ప్రలాపంబు సొంపగా 68

తా. దనయిష్టమును దెలుపదగు సమయమున దెలుపక యూరకుని క్రియతో దెలుపుట విహ్వాతము యగును తన ముగ్ధతనము చేత నగు భయము చెకితనుగును దన సంతోషమునకు దగిన నవ్వు హాసిత మగును దనశరీరము మోహమున లియ్యమగుట చేత దంతక్షతాదులను గుర్తెరుంగక యుండుట కుట్టమితమగును ప్రియుని యందగు ప్రేమ మోహాదుల చపలత్వము కుతుక మనబడును.

—*ద్వాదశావస్థలు*-

ప్రీతితో జూచిన నది చక్షుప్రీతియగును సంఘటన విషయ మగు విచారము చింతయగును యేకనిష్ఠాయుతంబగు విచారము సంస్మృతియగును ప్రియుని గుణములు గొనియాడుట ప్రలాపంబనబడును. 68

సీ. దవులు మోహంబున దనకిత్త రేఖలో
కలలేమి యరతితాపముతపింప
యరయ లజ్జాత్యాగ మగుశిగ్గు లేకుంట
దనకుదాజనగను దగుగమనము
మైనెరుగమి మూర్ఛమనగుధన్యత్వంబు
బలిలాభమున బ్రాప్తమైన దృష్టి
విలసిల్లు సంభోగ విప్రలంభము నల
శృంగారములు రెండు చెలువమొప్ప
గీ. నందుబాహ్యాంత రంబులనంగనొప్పు
రతులు బాహ్యంబు లగు నఖరదక్షతములు
నగును సాకీతిబంధంబు లంతరము
విప్రలంభంబు ద్వివిధమై వెలయు సాంబా. 69

తా. దవులువడు మోహముచేత దనకు నిత్యమగు గోక్కలేక యుండుట అరతి యగును తదేక ధ్యానమున తపించుట తాపంబగును శిగ్గులేకుండుట లజ్జాత్యాగ మగును దనకు దానేజనగమన మగును శరీరమును గుర్తెరుంగక యుండుటమూర్ఛయగును ప్రియునిలాభము వల్ల గలుగు దృష్టిధన్యత యగును. శృంగారము రెండు విధములుగా నుండును 1 సంభోగ శృంగారము 2 విప్రలంభ శృంగారము వానియందు రతులు రెండువిధంబులు 1 అంతరరతులు 2 బాహ్యరతులు 1 సాకీతి బంధంబులు అంతరరతులు 2 దంతనఖ క్షతాదులు బాహ్యరతులు మరియు విప్రలంభ శృంగారము మూడువిధములుగా నుండును. 69

సీ. సంగమాత్ప్రాగ్వి లాసంబభిలాషంబు
కలశియున్నాయుట కగువిరహము

బతివియోగంబున బరగు బ్రవాసంబు
మానంబు ద్వివిధమై మహిజలంగు
బ్రణయమానంబన బ్రబలును బతిపైని
బరహేతుకోపమై బరగునేని
పరసతీహేతులై పరగెడి కోపమిం
ర్షామానమందుగు సారవిదులు

గీ. నిదియు మరి బురుషులయందు నెన్నరాదు
నట్లు నెన్నరసాభాస మనగనొప్పు
బరగు శృంగార విప్రలంభంబునందు
భేదమితరములన గనుమించుసాంబ 70

తా. సంగమమునకు పూర్వమందు గలుగు విలాసము అభిలాష శృంగారమగును కలసి యెడబాయు నెడల విరహ విప్రలంభ శృంగార మగును. ప్రియుల దేశాంతర వియోగము ప్రవాస విప్రలంభ శృంగార మగును. మానము రెండువిధములై యుండును 1 బతిపైని నితరహేతుక మగు కోపము ప్రణయ మానం బగును బరసతీ హేతుక మగు కోపముయీర్షామానంబగును నీఈర్షామానము బురుషులయందు నెన్నబడదు. అటుల నెన్నర సాభాసమగును. యితరమగు భేదములు శృంగార విప్రలంభంబునందునె జెందును. 70

—*రసాభాసలు*—

సీ. అరయ స్త్రీ బురుషుల యందొక్కరికి బ్రీతి
గలుగుటనీచ సంగ మనుతియును
నొక స్త్రీ కనేకుల నొనర గూడెడు గొర్కె
నేక కాలంబున నెగడుటయును

బురుషులకును నట్లు పొసగుటయును నీచ
కును నుత్తముడు నుత్తమునకునీచ
రతివర్ణనము వయోరమణికి ముసలియు
ముదుసలికిని యుక్తముదిత ఘటన

గీ. రూపసౌందర్య వతికికు రూపిరతియు
అంగవైకల్యునకు యవ్వనాంగియుతియు
బశువిహంగాదిరతులను బలుకుటయును
నివిర సాభాస లనగను నెగడుసాంబా. 71

తా. స్త్రీబురుషు లిరువురియందు నొకరికి మాత్రమె బ్రీతిగలిగి యుండుటయును నొక స్త్రీకి అనేకబురుషుల గూడు గొక్క-నేకకాలంబున గలుగుటయును పురుషునకును నానీతిరో సంభవమగుటయును నీచనాయికకు నుత్తమ నాయకు నిరతియును నుత్తమునకు నీచరతియును యవ్వనస్త్రీకి వృద్ధుండును వృద్ధునకు యవ్వనియును రూపవతికి కురూపియును కురూపికి రూపవతియును అంగవైకల్యునకు యవ్వనియు నొనగూడుట యును పశుపిహంగాదుల రతులు బలుకుటయును రసాభాసలగును.

సీ. ఉరువడియొక భావ ముదయమ్మొగనుపట్టి
భావోదయంబన బరగుచుండు
భావముశమియింప భావశాంతియునగు
భావసంధియురెంట భ్రాంతిగొంట
భావశబలమొప్ప బహునేకములుగా
బాడమి శమింపందె బూనుకొనుట
భావరసాదుల భాసురత్వంబులు
భావనియ్యల కృపన్బడయనలయు.

గీ. భావశాస్త్రార్థ గతములై పరగువీని
బాలులకు బోధనార్థమై బలుకబడియె
దోషములుగల్గినను శారదోలిదీని
జేకొని కటాక్షమున బ్రోవజెల్లుసాంబా 72

తా॥ ముందుగా నొక భావము స్ఫుటముగా గనుపించిన నది భావో
దయమనంబడును. నాభావము శాంతించిన నది భావశాంతియన
బడును. అందు రెండు భావములు స్ఫుటతరముగాక భ్రాంతినిగలుగ
జేసిన నది భావసంధియగును. అందు అనేక భావములు బుట్టుచు
శాంతించుచూ నుండిన నది భావశబలతయనబడును. భావరసా
దులయొక్క బ్రకాశమును భావజ్ఞులయొక్క దయచేత బొంద
వలయును. భావశాస్త్రమునందు గలుగు యీవిషయములను బా
లులకు బోధనార్థముగా సంగ్రహించి వ్రాయబడెను. దీని
యందుదోషములు గలిగియున్నను నాదోషములు బరిహ
రించి రక్షింపవలయును. 72

ఇది శ్రీభారద్వాజసగోత్ర పవిత్ర వేదులక్షేశ్వర
తనూభవసీతారామశాస్త్రిప్రణీతంబగు
భరతశాస్త్రి సంగ్రహంబునందు
రస ప్రకరణము
సంపూర్ణము.





# రాగప్రకరణము.



సీ. అరయ సర్వేశునందగు భూతచయము నం
దాత్మమానసవాయులనవరతము
గారణంబగుచును గడగు నాదము బ్రహ్మ
గ్రంథిస్థితంబుగా గలయ బారి
తగ నాభిహృత్కంఠపతులందు గ్రమముగా
మంద్రమధ్యమతారమనగ బరగు
నది వర్ణధ్వన్యాదులని రెండువిధములౌ
వాక్యరూపములెల్ల వర్ణమయము
గీ. వేణువీణాదులను ధ్వనింపులయుచుండు
చెలనధృవముల నర్వాణ చెన్ను మీరు
నందు ద్వావింశ శృతులనునగు ధృవంబు
చెలనము నషోడశశ్శృతులేల్లు సాంబ॥ 73॥

తా॥ సర్వేశ్వరుండగు భగవంతునియందు గలుగు పృథివ్యప్తేజో వాయురాకాశంబులను పంచభూత సముదాయంబునందు ఆత్మమనోవాయువులు ముఖ్యకారణంబుగా బ్రకాశించు నాదము బ్రహ్మగ్రంథినుంచి విస్తరిల్లి నాభియందు మంద్రమనియు, హృదయమునందు మధ్యమమనియు, కంఠమునందు తారకమని బ్రకాశించును. ఆనాదము వర్ణాత్మకమనియు, ధ్వన్యాత్మకమనియు రెండువిధంబులు. అందు వేదవేదాంగములు వర్ణాత్మకంబులు

వేణువీణాదులు ధ్వన్యాత్మకంబులు ధ్వనిప్రాధాన్యముగు వీణయు చెలనము, ధృవము అని రెండువిధంబులు అందుపదహారుశృతులు గలది చలనమనియు, యిరువదిరెండు శృతులుగలది ధృవమని యు చెప్పబడును. 73

సీ దేవయోనులయందు దేజరిల్లుధృవంబు
చెలనముమానవ చెయముకిగును
షడ్యమంబొకటందు సంమ్మదంబగుశుద్ధ
శృతిచతుశ్శృతియు షట్స్రృతులరిషము
మూడుకీతలనంగ మొనయుంగాంధారంబు
నగుశుద్ధ సాధారణాంతగముల
మరిశుద్ధమనిప్రతి మధ్యమంబనిరెండు
పంచమంబొకటందు బరిఢవిల్లు
గీ. దైవతంబును రిషమట్లుదనరుచుండు
శుద్ధకైశికి కాకలిసొబగుచెంది
నిలనిషాదంబు లిటుమూడునింపుగాంచు
నివియు పదియూరు శృతులననెగడుసాంబా॥ 73

తా॥దేవయోని సంభూతులగు గంధర్వయక్షశిద్ధాదులు చేయుగాన ము ధృవమను వీణననుసరించియుండురు. మానవులుజేయుగాన ము చెలనమను వీణననుసరించి యుండును. దానియందు షడ్య మంబొకటియును రిషభములు మూడును, గాంధారములు మూ డును, మధ్యమములు రెండును, పంచమంబొకటియును దైవత ములుమూడును, నిషాదములుమూడును వెరశి పదహారుశృతు లగును. వైనము1 షడ్యమము 2శుద్ధరిషభము 3 చతుశ్శృతిరిషభ ము4 షట్స్రృతిరిషభము 5శుద్ధగాంధారము6 సాధారణగాంధార

ము 7 అంతరగాంధారము 8 శుద్ధమధ్యమము 9 ప్రతిమధ్యమము 10 పంచమము 11 శుద్ధదైవతము 12 చతుశ్శ్రుతిదైవతము 13 షట్ఛ్రుతిదైవతము 14 శుద్ధనిషాదము 15 కైశికినిషాదము 16 కాకలినిషాదము యీరీతిగాపదహారు శ్రుతులు గలిగి యుండును. 74

సీ. తగషడ్జరిషభ గాంధారమధ్యమపంచ
మములుదైవత నిషాదమ నెడిస్వరము
లారోహణావరోహణముల ద్వివిధంబు
నవియారువిధములు నగునుమఱియు
సమషాడవౌడవస్వరతుదల్సామిక
గాధికార్చికమన గడగు సతము
వొక్కొక్కస్వరమందు వొదలిన నవిరాగ
ప్రస్తారపంక్తులెపరిబలుచుండు

గీ. పొల్పసమగతి స్వరములపూర్ణమైన
మేళమనరాగములయందు మెరయుచుండు
శుద్ధప్రతిమధ్యమముల చేసొంపుమీరి
నవియుడెబ్బదిరెండుగా నగునుసాంబా॥ 75

తా॥ షడ్జమమురిషభము గాంధారము మధ్యమము పంచముదైవతము నిషాదము అనుసప్తస్వరములు ఆరోహణము అవరోహణములను రెండుభేదములు చెందును అవియుతిరుగానారువిధంబులగును అందుసమమనసంపూర్ణముగానుండును షాడవము ఆరుస్వరములుగలదిఔడవము అయిదుస్వరములుగలది స్వరాంత్యంనాలుగుస్వరములుగలది సామికము మూడుస్వరములుగలది గాధికము రెండుస్వరములుగలదిఆర్చికమువకస్వరముగలదియగునుయిట్లు

సప్తస్వరములందు అరోహణమునగాని అవరోహణమునగానివొ క్కొక్కస్వరమువంతున తగ్గుచూరాగా పైనామములను పొంది రాగప్రస్తారపంక్తులగునుసమగతిగలస్వరములతో అరోహణావరో. హణములయందు శృతిభేదములు గలిగినను సంపూర్ణములగునవి రాగములకు మేళకర్తలనంబడును అట్టిమేళకర్తలు శుద్ధమధ్యమ ప్రతి మధ్యమభేదములచే డెబ్బది రెండుభేదంబులుగలవు 75

సీ. రసరూపసంఖ్యలరాజిల్లుగుణయుక్త
నామంబులందునున్న తివహించు
నంకంబులకుసంజ్ఞలగునుహల్లులయందు
కాదిగానవసంఖ్యకముకవర్గ
టాదిగాతొమ్మిదట్లగుటవర్గంబన
యాద్యష్టకంబనియనిరిబుధులు
పాదిపంచకమనంబడునకంములకెల్ల
వానుదిగ్గమనంబువప్పునెప్పు

గీ. రాగతాళాదినామములరసిసంఖ్య
గనగుణాదికములగుస్తులరయవలయు
నవియువరుసగబెంచిననగుననంత
రాగములువానికగుబూర్వరసముసాంభా

తా॥ పైమేళకర్తలకు రసమునుసంఖ్యను గుణమునుదెలుపునట్టి పేరు లువెనుకటి గ్రంధకర్తలు బెట్టియుండిరి. నవి దెలియుటకుగాను హల్లులయందు గలుగుసంజ్ఞలు కవర్ణము మొదలు తొమ్మిది వరకు కవర్గమనియు, టవర్ణము మొదలు తొమ్మిదివరకు టవర్గ మనియు, యవర్ణము మొదలు యెనిమిదివరకు యవర్గమనియు పవర్ణము మొదలు అయిదువరకు పవర్గమనియు శేషములుబిందు

వులుగాను ఖంకసంజ్ఞలగుసు య్యడఖువై వునకు బెంపవలయును వు దాహరణము మాయామాళవగౌళయనునప్పుడు మ అయిదు య వకటి 15యిదిపది హేనో మేళకర్తయని తెలియును చిన్మయాకార ముగలదియు సత్యమగు శాంతరసముగలదియు నగును కనకాంగి యనునపుడు వకటో మేళకర్తయనియును శృంగారరసముగలది యు తేజోరూపముగలదియుయని తెలియును యీరీతిగా అన్ని మే ళకర్తలయందు గ్రహింపవలయును అందు నొక్కొక్క మేళకర్త నుబ్రస్తరించిన అనేకరాగములుబుట్టును వాటికిబూర్వ రసమే ప్ర ధానమైయుండును 76

## స్వరప్రస్తారము.

సీ. స్వరముల బ్రస్తారసము దయంబెట్లన్న
నొకటి రెండును మూడునొనర నాలు
గాదిసంఖ్యాంకముల్గల పంక్తి యందగు
సరిగమ పదనిస సంజ్ఞ చెందు
నవియునస్ఖలితమై నమరురీతెట్లన్న
కడపలియంకముల్ క్రమ్మరించి
సంతతన్నికటంబునను క్రమక్రముగా
పంక్తిభేదంబులు బరగకుండ

గీ. వినిమయింపంగ భేదముల్విస్తరిల్లు
యవిపరస్పరగుణముల్లై యథానుసంఖ్య
రాగబ్రస్తార విధులందు రమ్యమగుచు
నిఖిలలోకప్రకాశమై నెగడుసాంబా॥ 77

తా॥ స్వరప్రస్తారభేదంబెట్లన 1-2-3-4-5-6-7-8-యిట్లు ప్రస్తరింపదగుపంక్తియందుగల సరిగమ పదనిస యనువాటికి గుర్తులుగానుంచుకొని ముందుగా చివరనుండు యేకదశస్థానములు మార్చి తరువాత దశశతస్థానములను వరుసగా మార్చుచురాగా పునరుక్తంబులురాకుండా నందుగల భేదంబు లేర్పడును పైయంకంబులపరస్పరము గుణించిన నందుగలభేదంబులు దెలియును.

ఉదాహరణము:— స రి గ మ యనునాలుగుస్వరములు బ్రస్తరించిన యన్ని భేదంబులేర్పడును నవియెట్లుండుననిన పైస్వరంబులపైని గ్రమంగా -1-2-3-4 గుర్తులునుంచుకొని సహస్రస్థానమందున్న నొకటిని శతస్థానమందున్న రెండుచేగుణించిన రెండు వచ్చునుదానిని దశస్థానమందువున్న మూడుచే గుణించిన ఆరు వచ్చును. దానిని యేకస్థానమందువున్న నాలుగుచే గుణించిన యిరువై నాలుగు వచ్చును గనుక యిరువదినాలుగు భేదములు నేర్పడునని తెలియును 77

| రుజువు | సంఖ్య. | స్వరము. | సంజ్ఞ. |
|---|---|---|---|
| స-ప్రస్తరించిన భేదం 1 యగును | 1 | స | 1 |
| సరి-ప్రస్తరించిన భేదం 2 యగును | 2 | సరి | 1-2 |
| సరిగ-ప్రస్తరించిన భేదం 6 యగును | 2 | | |
| సరిగమ-ప్రస్తారం భేదం 24 యగును | 3 | రిస | 2-1 |
| సరిగమప- ,, భేదం 120 యగును | 6 | | |
| సరిగమపధ- ,, భేదం 720 యగును | 4 | సరిగ | 1-2-3 |
| సరిగమపధని-,, భేదం 5040 యగును | 24 | సగరి | 1-3-2 |
| | | రిగస | 2-3-1 |
| | | రిసగ | 2-1-3 |

| | |
|---|---|
| గరిస | 3-2 1 |
| గసరి | 3-1-2 |

24 భేదములకు రుజువు

స్వరము-సంజ్ఞాఅంకములు

| | |
|---|---|
| స రి గ మ | 1 2 3 4 |
| స రి మ గ | 1 2 4 3 |
| స గ మ రి | 1 3 4 2 |
| స గ రి మ | 1 3 2 4 |
| స మ రి గ | 1 4 2 3 |
| స మ గ రి | 1 4 3 2 |

2 చక్రం

| | |
|---|---|
| 2 1 3 4 | రి స గ మ |
| 2 1 4 3 | రి స మ గ |
| 2 3 4 1 | రి గ మ స |
| 2 3 1 4 | రి గ స మ |
| 2 4 1 3 | రి మ స గ |
| 2 4 3 1 | రి మ గ స |

3 చక్ర.

| | |
|---|---|
| 3 1 4 2 | గ స మ రి |
| 3 1 2 4 | గ స రి మ |
| 3 4 2 1 | గ మ రి స |
| 3 4 1 2 | గ మ స రి |
| 3 2 4 1 | గ రి మ స |
| 3 2 1 4 | గ రి స మ |

4 చక్రం

| | |
|---|---|
| 4 1 3 2 | మ స గ రి |
| 4 1 2 3 | మ స రి గ |
| 4 2 1 3 | మ రి స గ |
| 4 2 3 1 | మ రి గ స |
| 4 3 1 2 | మ గ స రి |
| 4 3 2 1 | మ గ రి స |

యీరీతిగా ఆరోహణావరోహణముల ప్రస్తరింప నొక్కొక్క మేళకర్తయందు షాడవాది భేదములుగల 10080 రాగములు బుట్టును గ్రంధవిస్తారభీతిచే ముగింపబడెను. యీ క్రింది మేరువులను జూచినవిశదమగును.

| స్వరములు | ఖండములు | స | రి | గ | మ | ప | ధ | ని | ప్రస్తారములు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| స | 1 | 1 | | | | | | | 1 |
| రి | 2 | 2 | 1 | | | | | | 3 |
| గ | 4 | 5 | 2 | 1 | | | | | 8 |
| మ | 8 | 12 | 5 | 2 | 1 | | | | 20 |
| ప | 16 | 28 | 12 | 5 | 2 | 1 | | | 48 |
| ధ | 32 | 64 | 28 | 12 | 5 | 2 | 1 | | 112 |
| ని | 44 | 144 | 64 | 28 | 12 | 5 | 2 | 1 | 256 |
| స ని | 127 | 320 | 144 | 64 | 28 | 12 | 5 | 2 | 575 |

ప్రస్తారమునం
షడ్యాదిస్వరస
ఖ్యలను దెలుపు
పృథ్వీమేరువు.

స్వరప్రస్తారపధకము

| స | రి | గ | మ | ప | ధ | ని | సః | స్వరశ్రేఢి |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 4 | 8 | 16 | 32 | 64 | 127 | సంఖ్య |
| 1 | 2 | 5 | 12 | 28 | 67 | 144 | 320 | పాతాళము |
| 1 | 3 | 8 | 20 | 48 | 112 | 256 | 575 | మహాపాతాళ |

### షడ్జమేరువు

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | | రిని | |
| | | | | | | | | | సని | 1 | ష9 |
| | | | | | | | | ని | 1 | 0 | 8ష |
| | | | | | | | ధ | 1 | 0 | 8 | ష7 |
| | | | | | | స | 1 | 0 | 7 | 7 | ష6 |
| | | | | | మ | 1 | 0 | 6 | 6 | 27 | ష5 |
| | | | | | | 0 | 5 | 5 | 20 | 35 | ష4 |
| | | | రి | 1 | 0 | 4 | 4 | 14 | 24 | 54 | ష3 |
| | | స | 1 | 0 | 3 | 3 | 9 | 15 | 31 | 57 | ష2 |
| | 0 | 1 | 0 | 2 | 2 | 5 | 8 | 15 | 26 | 44 | ష1 |
| 1 | 1 | 0 | 1 | 1 | 2 | 3 | 5 | 8 | 12 | 20 | హీనం |

### రిషభమేరువు.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | సని | రిని | | |
| | | | | | | ధ | ని | 1 | 5 | రి4 |
| | | | | మ | ప | 1 | 4 | 10 | 24 | రి3 |
| | | రి | గ | 1 | 3 | 6 | 13 | 30 | 66 | రి2 |
| 0 | స | 1 | 2 | 3 | 6 | 13 | 26 | 50 | 96 | రి1 |
| 1 | 1 | 1 | 2 | 4 | 7 | 12 | 21 | 36 | 62 | హీనం |

### గాంధారమేరువు.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | రిని | |
| | | | | | | ధ | ని | సని | 1 | 3 గా |
| | | | గ | మ | ప | 1 | 3 | 9 | 22 | 2 గా |
| | స | రి | 1 | 2 | 5 | 10 | 22 | 46 | 92 | 1 గా |
| 1 | 1 | 2 | 3 | 6 | 11 | 21 | 93 | 72 | 132 | 1హీన |

## మధ్యమ మెరువు.

సని రిని

మ ప ధ ని | 1 | 3 | మ2

0 స రి గ | 1 | 2 | 5 | 12 | 26 | 58 | మ1

| 1 | 1 | 2 4 | 14 | 27 | 52 | 100 | 192 | హీనం |

## పంచమ మేరువు.

ప ధ ని సని రని

స రి గ మ | 1 | 2 | 5 | 12 28 | 1 ప

| 1 | 1 | 2 | 4 | 8 | 15 30 | 59 115 | 225 | ప హి

## ధైవత మెరువు.

ధ ని సని నిరి

స రి గ మ ప | 1 | 2 | 5 | 12 | ధ 1

| 1 | 1 | 2 | 4 | 8 | 16 | 31 | 62 | 122 | 241 | ధ హీ |

## నిషాదమేరువు

ని స రిని

స రి గ మ ప ద | 1 | 2 | 5 | ని 1 |

1 | 1 2 | 4 | 8 | 16 | 32 | 63 | 125 248 | హీనం |

## ఖండప్రస్తార పథకము.

| స | సరి | సరిగ | సరిగమ | సరిగమప |
|---|---|---|---|---|
| 1 | 2 | 6 | 24 | 120 |

దీనివివరము పైనప్రస్తరించబడియున్నది

సీ. పూర్వాభిముఖముగా నుంచితొమ్మిది రేఖ
లనునడ్డుగానన్ని సమర జేర్ప
నరువదినాలుగు నగుకోష్టములయందు
నాగ్నేయదిశగడి నాది జేశి
రిషములుగాంధార రీతులెరింగియు
వాటిక్రిందను సమవరుసలందు
శుచిరిషములు మూడుసోభిల్లగానుంచి
దుగచతుశ్శ్రుతుల నందువడిజేర్చి
గీ॥ నొకటిషట్శ్రుతి యుతముగానొప్పనిల్పి
దగుక్రమంబున విమలసాధార ణాంత
రమునుసాధారణము నాంతరంబులనెటి
నారుగాంధారములు గూర్పనగునుసాంబా॥ 78

తా. తూర్పు పడమరలకు తొంమ్మిది రేఖలును, వుత్తర దక్షిణముల కు తొంమ్మిది రేఖలును, వ్రాశినయందు ఆరువది నాలుగు గళ్ళు యేర్పడును. నందు ఆగ్నేయదిశ మొదలు రెండుగళ్ళయందు రిషభ గాంధారములు గుర్తులుగా వ్రాశి వాటిక్రింద వరుసగా మూడుగళ్ళయందు శుధరిషభములు. తరువాత రెండు చతుశ్శ్రుతిరిషములు తరువాత నొకటి షట్శ్రుతి రిషభమును వ్రాయవలయును తరువాత నారీతిగానే వకటి శుధగాంధారంబును. రెండు సాధారణ గాంధారంబును. మూడు అంతరగాంధారంబును నాలుగు సాధారణగాంధారము అయిదు అంతరగాంధారము ఆరు అంతరగాంధారము వరుసగా నొకధానిక్రిద మరివకటిగా వ్రాయవలయును,,

సీ. వాయువ్యదిశనుదై. వతనిషాదగణబులు.
గురుతు లౌనట్టులను గుదురు బరచి
వరుసగా విమలధైవతములు మూఁడింట
దగచతు శ్రుతిధైవతములు రెంట
నొకటారు శ్రుతులంతో నొనరుధైవత మొంట
కడుశుద్ధకైశికి కాకలియును
కైశికి కాకలి కాకలి శ్రుతులనం
బహునిషాదంబులు బరగగూర్చి,

గీ. వక్కటాదిగ ముప్పదా రొక్కటొకటి
నేపనగు కోష్టములయందు జేర్చిచూడ
మేళకర్తలశ్రుతి చయమెరుగవచ్చు
నట్లుప్రతిమధ్యమమునందు నగునుసాంబ॥

తా. పైరీతిగా వాయవ్యమూల రెండుగళ్ళయందు సరిగాధైవత నిషాదములు గురుతులు జేసి వాటికి యెడమవైపు వరుసగా మూడుశుద్ధధైవతములు రెండు చతుశ్రుతిధైవతములు నకటి షట్శ్రుధైవతంబును జేర్చవలయును. అందుక్రింద నకటి శుద్ధనిషాదము రెండు కైశికినిషాదము. మూడు కాకలినిషాదము నాలుగు కైశికి నిషాదము అయిదు కాకలినిషాదము ఆరు కాకలినిషాదము యిట్లుజేర్చిచూచిన శుద్ధమధ్యమరాగములు 36 ప్రతిమధ్యరాగములు 36 వెరశి 72 మేళకర్తలశ్రుతి భేదంబులు బాగుగ దెలియును.

## ధేను మేరువు.

మేళకర్తలశ్రుతుల్దెలుపును| రి |గా

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | శు | శు |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | శు | సా |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | శు | అం |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | చ | సా |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | చ | అం |
| 31 | 32 | 33 | 34 | 35 | 36 | ష | అం |
| దైవ | శు | శు | శు | చ | చ | ష | |
| నిషా | శు | కై | కా | కై | కా | కా | |

సీ. కనకాంగి రత్నాంగిగానమూర్తి యువ
స్పతిమానవతితాన పాలనాంగి
సేనాధిపతియును చెలగుహనుమత్తోడి
ధేనుకనాట కాధేయప్రియము
కోకిలప్రియునును కోమలరూపిణి
గాయకప్రియసుర కాంతభూష
మాంజులతరమాయ మాళవగౌళయు
చక్రవాకమునూర్యచారుకాంతి॥
గీ. హాటకాంబరి ఝంకార హానముబిగుల
వంద్యనటభైరవము కీరవాణియుఘన
ఖరహరిప్రియయును గౌరికామదంబు
వరుణసంమ్మోదినియునంగవరలుసాంబా॥

తా. ఈ మేళకర్తలనామంబులు కొన్నిగ్రంధములయందు భేదంబుగా నున్నవి. అభిప్రాయంబు మాత్రము నొకటిగానే నుండును. 1కనకాంగి 2రత్నాంగి 3గానమూర్తి 4 వనస్పతి 5 మానవతి 6 తానరూపిణి 7సేనాపతి 8 హనుమత్తోడి 9 ధేనుక 10 నాటకప్రియ 11కోకిలప్రియ 12రూపావతి 13 గాయకప్రియ 14వకుళాభరణము 15 మాయామాళవగౌళ 16 చక్రవాకము 17సూర్యకాంతి 18హాటకాంబరి 19 ఝంకారధ్వని 20నటభైరవి 21కీరవాణి 22ఖరహరప్రియ 23గౌరీమనోహరి 24 వరుణప్రియ॥

సీ. శృంగార రససమంచిత మారరంజని
చారుమంగళమాళి చారుకేళి
సాంద్రరసానంగి సరసాంగియును హరి
కాంభోజి ధీరశంకర కరమణి
యానగానందిని యోగప్రియము రాగ
వర్ధన నిగాంగేయ స్వరవిభూష
వాగధీశ్వరి శూలివరచలనాటల
యందుశుద్ధంపు మధ్యమము పైన
గీ. చక్రమునజూచి స్వరశ్రుతిసరణులరశి
గానవేత్తలు సభలందుగడగిబాడ
నరయసుఖసంపదల చందనగునటంచు
ధాతనారదునకుదెల్పె దయనుసాంబా. 81

తా. 25 మారరంజని 26 చారుకేళి 27 సరసాంగి 28 హరికాంభోజి 29 ధీరశంకరాభరణం 30 నగానందిని 31 యోగప్రియ 32రాగవర్ధని 33 గాంగేయభూషిణి 34 వాగధీశ్వరి 35శూలిని 36 చలనాటయీాము పైె ఆరురాగము లయందు శుద్ధమధ్యమ

ము యితరశ్రుతులుపై చక్రమ్ములో దెలియును వానినెరిగి గానవే
త్తలు సభలయందు గానము చేయ సకలసంపదలను బొందుదు
రనినారదునకు బ్రహ్మ దెలిపెను. 82

సీ. ప్రథమాదిగానందు ప్రతిమధ్యమము జేర్ప
ముప్పదారగు రాగములు జనించు
నందు సాళగ జలార్ణవము ఝల్లవరాళి
నవనీతముసు పావనయురఘుప్రియ
బహుళగవాంభోజి భవప్రియశుభపంతు
షడ్విధమార్గిణి స్వర్ణ దేహ
లలిదివ్యమ శిధవళాంబరి నామనా
రాయ శికామవర్ధనయు రామ

గీ. ప్రియగమనశ్రిమ మువి శ్యాంబరంబు
శ్యామలాంగియు షణ్ముఖ శాసినియును
శింహ్వామధ్యమమును స్వర్ణ శ్రీవసంత
ధర్మవతినీతి మతియన దనర్సు సాంబా॥ 82॥

తా. ప్రతిమధ్యమరాగ మేళకర్తలు 37 సాళగ 38 జలార్ణవము
39ఝల్లవరాళి 40నవనీతము 41పావని 42రఘుప్రియ 43గవాం
భోజి 44 భవప్రియ 45 శుభపంతువరాళి 46 షడ్విధమార్గిణి
47సువర్ణాంగి 48దివ్యమణి 49ధవళాంబరి 50నామనారాయణి
51 కామవర్ధని 52 రామప్రియ 53 గమనశ్రమ 54 విశ్వాంబరి
55 శ్యామలాంగి 56 షణ్ముఖప్రియ 57 శింహేంద్రమధ్యమం
58 హేమవసంత 59 ధర్మావతి 60నీతిమతి॥ 83॥

సీ॥ కాంతామణియుశివ కామవృషామోది
వరకల్పలతికాంగి వాక్పతియును

మేచక కళ్యాణిమెరయుచింతామణి
సుచరిత్రిజ్యోతిస్సుశోభనాంగి
నగధాతువర్ధనినాశికాభరణంబు
కోసలమును రశికులవినోది
యనెడిడబ్బదిరెండు యగుమేళకర్తలు
నవరసంబులను జెంన్న లరుచుండు

గీ. యందుబోల్చి యనేకములైనగాని
బాలభోధార్థముగ గొంన్ని బలుకబూని
నవియు లక్షణ లక్ష్యంబులలరునట్లు
జెప్పెదనుజిత్తమున జేర్చ జెల్లుసాంబా॥ 84

తా 61 కాంతామణి 62 వృషభప్రియ 63 లతాంగి 64 వాచస్పతి 65 మేచకకళ్యాణి 66 చింతామణి 67 సుచరిత్రం 68 జ్యోతి స్వరూపిణి 69 ధాతువర్ధని 70 నాశికాభరణం 71 కోసలము 72 రశికప్రియ యీడెబ్బదిరెండు మేళకర్తలను వొక్కొక్కదాన్ని పై రీతిగా బ్రిస్తరించినయడల అనేకములగు రాగములు బుట్టును. అయినను బాలులకు బోధకొరకు కొన్ని ముఖ్యములగు జన్య రాగములు లక్ష్యలక్షణములతో నిందు వ్రాయబడుచున్నవి 84

సీ. అరయనిషాదంబు నారోహణను లేక
మవరోహణము పూర్ణమగుచునుండ
కనకాంగియందును కనకాంబరియునగు
కోకిలధ్వానంబు కోసలమున
మాయమాళవియందు మరినటసారంగ
వరుణప్రియంబున వందినియును

కాంభోజియగుహరి కాంభోజియుండును
యాగప్రియమునందుయజ్ఞకాంతి
గీ. దివ్యమణియందు కుంతల• దీప్తిగల్లు
శింహ్వారాణ్మధ్యమమునందు సేషరవము
దోచుకరహారిప్రియను ఖద్యోతమణియు
ధర్మవతియందును దామ్యంబు దనరుసాంబా॥ 85

తా. ఆరోహణమునందు నిషాదము లేక అవరోహణమునందు పూర్ణమైయుండిన నదికనకాంగియందు కనకాంబరియగును నదియే కోసలమునందు కోకిలరవంబగును మాయామాళవమునందు నటసారంగయగును వరుణప్రియయందు వందిసియగును హరికాంభోజియందు కాంభోజియగును యాగప్రియయందు యజ్ఞకాంతి దివ్యమణియందు కుంతలదీప్తియగును శింహేంద్రమధ్యమమున సేషనాదనుగును ఖరహరప్రియందు ఖద్యోతమణియగును ధర్మావతియందు దామ్యంబగును 85

సీ. గలుగ దారోహణన్గాంధారి మేయడ
నవరోహణమువ్పూర్ణమనగ నొప్పు
కనకాంగియందునుగలుగుశుద్ధముఖారి
పెనుగురత్నాంగిని ఫేనకాంతి
గానమూర్తియునందుగలుగునామవరాళి
హాటకాంబరినిశింహ్వాళిమటండ్రు
ఖరహరప్రియయందుగలుగుదర్బారన
వరుణప్రియ మునందువాణియగును
గీ. మధ్యమనిషాదములువర్జమగుచు రెంట
పరగమాళవియందు భూపాళమగును

తోచు రేగుప్తి హనుమంత తోడియందు
నగును కాంభోజియందు మోహనయు సాంబా 86

తా. ఆరోహణమున గాంధారము వర్జ్యమై అవరోహమునందు పూర్ణ
మైయుండినది కనకాంగియందు శుద్ధముఖారియు రత్నాంగియం
దు ఫేనద్యుతియు హాటకాంబరి యందు సింహాళమును గానమూ
ర్తియందు నామవరాళియు ఖరహరప్రియయందు దర్బారును
వరుణప్రియయందు వాణియును, నగును ఆరోహణా వరోహణ
ములయందు మధ్యమనిషాదములు లేక యుండిన మాయామాళ
వంబున భూపాళయును హనుమంతతోడియందు రేగుప్తియు హ
రికాంభోజియందు మోహనయునగు. 86

సీ. దైవతరిషభము ల్దగుల వారోహణ
సూర్వానార్ణవరోహణాన్పొల్పెసంగ
ఘంటారవంబన నగురత్నాంగిని
ధన్యాశితోడిని దగజనించు
ఆలనటభైరవినగు యభేరియనంగ
సుచరిత్రనగు భోగసుమతియందు
ఖరహరప్రియయందు ; కగువజ్రకాంతి
వగవినోదిని జక్రవాకమందు

గీ. శంకరాభరణమునందు శాంభవియును
లలితమగు శింధుదేశ్య ఝలార్ణవమున
మారకళ్యాణి మృగరాజమధ్యమున
చారుకేశిని చంద్రిక జనును సాంబా, 87

తా ఆరోహణమున రిషభదైవతములు లేక అవరోహణము పూర్ణము
గాసుండిన, నది రత్నాంగియందు ఘంటారవంబును, తోడియం
దు ధన్యాశియును, నటభైరవియందు యభేరియును భోగవతి
యందు సుచరిత్రమును, ఖరహరప్రియయందు వజ్రకాంతియును,

చక్రవాకమునందువినోదినియును, శంకరాభరణమునందు శాంభవియును, ఝుంఝూటనమునందు శింధుదేశియును శింహేంద్రమధ్యమమున మనదనకళ్యాణియును, చారుకేశియందు చంద్రిక. యును నగును. 87

సీ. పంచమహీనమైపరగు ద్వాయంబున
తోడియుహనుమంతతోడినగును
మాయమాళవియందు మరివసంతయునగు
భైరవియగునటభైరవమున
ఖరహరప్రియయందు గలుగు శ్రీమతియన
భవప్రియమున బడబాగ్ని బుట్టు
దగరామప్రియయందు ధౌరేయమనబడు
ధవళాంబరంగుమం దాకినౌను
గీ, రిషనిపాదంబులును లేక గ్రహముగ
దైవతమువక్రపూర్ణమై దనరుచుండ
నదియునానంద భైరవమగునటండ్రు
నదియునటభైరవికి జన్యమగునుసాంబా. 88

తా॥ ఆరోహణావరోహణములయందు పంచమము లేక యుండినసది హనుమంతతోడియందు తోడియు, మాయామాళవమునందు వసంతయును నటభైరవియందు భైరవియును ఖరహరప్రియయందు శ్రీమతియును, భవప్రియయందు బాడబాగ్నియును, రామప్రియయందు ధౌరేయమును, ధవళాంబరియందు మందాకినియును, నగును. ఆరోహణమునరిషభనిషాదము లేక రిగ్రహముగా వక్రదైవతముగలిగి అరోహపూర్ణమయ్యేనేని అది ఆనందభైరవియగును నదినటభైరవికి జన్యమగును. 88

సీ. గాంధారనిషధముల్గలు గవ్వారోహణ
నవరోహణము పూర్ణమగుచునుండ
సరసాంగియందును సదమలసురసేన
ఘనశివకాంభోజి ఖరహరందు
యగునుసావేరి మాయామాళవంబున
కోకిలప్రియ ందుకోసలంబు
కాంబోజినెదుకులకాంభోజిజనియించు
గోత్నారిలతికసుగొనబుమీరు
గీ. విమలమేచకకళ్యాణివిశ్రుత బు
భూపకళ్యాణియనగనుబోలియుండు
బరగునారభిశంకరాభరణమందు
తోడియందున సావేరిదోచునాంబా 89

తా. ఆరోహణమున గాంధారనిషాదములు లేక అరోహణము పూర్ణముగానుండిన నది సరసాంగియందు సురసేనయును. ఖరహరప్రియందు శివకాంభోజియును మాయామాళవి యందు సావేరియును, కోకిలప్రియయందు కోసలమును, కాంభోజియందు యదుకుల కాంభోజియును లతాంగియందు గోత్నారియును. మేచకకళ్యాణియందు భూపకళ్యాణియును, శంకరాభరణమునందు అరభియును, తోడియందు నసావేరియునగును. 89.

సీ. ఖరహరప్రియమిత్ర కమలామనోహరి
మరమనోహరిమిత్ర మానవతికి
తానరూపిశిమిత్ర తనుకీర్తియనజను
చక్రవాకముమిత్ర చంద్రికయగు

కామవర్ధనిమిత్ర కరముపంతువరాళి
వరుణప్రియకు మిత్ర వారుణాంగి
యాగప్రియము మిత్రి యామినీతిలకంబు
రామప్రియకుమిత్రి రమ్యకేళి
గీ. శంకరాభరణమిత్రగు శ్యామలాంగి
కరముకళ్యాణి మిత్రగు కలవరంబు
నాటకును మిత్రిసగు సురానందనాంగి
పావనికిమిత్రి హంసనంబునను సాంబ॥ 90

తా. ఖరహరప్రియకు కమలామనోహరియును, మానవతికి మనోహరియును తానరూపికి తనుకీర్తియును, చక్రవాకమునకు చంద్రికయును, కామవర్ధనికి పంతువరాళియును, వరుణప్రియకు వారుణాంగియును, యాగప్రియకు యామినీ తిలకమును, రామప్రియకు రమ్యకేళియును, శంకరాభరణమునకు శ్యామలాంగియును, కళ్యాణికి కలవరంబును, నాటకు సురానందనయును, పావనికి హంసయును మిత్రలనంబడును. 90

సీ. మేళవపూర్ణమై మెరయమిత్రసదగు
షాడవపూర్ణముల్సఖియలగును
ఔడవపూర్ణములౌను దత్సుతులు స్వ
రాంతపూర్ణంబులురమణులగును
సామికగాధిక నముదయార్చికములు
సేవకజాతిగా చెప్పబడును
పూర్ణషాడవములు పురుషరాగంబులు
పూర్ణడవంబులు పువ్వుబోంట్లు

గీ. పూర్ణసామికగాధి కంబులుపురుషులు
పూర్ణమార్చి కస్వరతుదలోప్పల్ప స్త్రీలు
జన్యజనకాధి భావముల్జెందినతము
నవరసంబుల భాశిలు నవియుసాంబా॥ 91

తా. మేళకర్తవలె ఆరోహణావరోహణములయందు సంపూర్ణము గానుండిన నది ఆయారాగములకు మిత్రియనబడును. ఆరోహణమున షాడవమును అవరోహణమున పూర్ణమును గలవి స్త్రీరాగములు యనబడును. అరోహణమున ఔడవమును అవరోహణమున పూర్ణమునుఅగునవి వాటిపుత్త్రులనబడును. ఆరోహణమున స్వరాత్యము అవరోహణమున పూర్ణముగలవి వాటికినతులగును. అవరోహణమున సామికముగాని గాధికముగాని ఆర్చితముగాని గలిగి అవరోహణము పూర్ణముగానున్న నవి వాటి సేవకులుగా జెప్పిరి. ఆరోహణము పూర్ణము అవరోహణము షాడము గలవి పురుషరాగములు పూర్ణౌడవములు స్త్రీలు పూర్ణసామికగాధికములు పురుషులు పూర్ణ ఆర్చిక స్వరాంత్యములు స్త్రీలు యిందుకువ్యతిరేకములు నపుంసరాగములు యివి జన్యజనకాది భావములను పొంది నవరసంబులచేత ప్రకాశింపుచుండును॥ 91

ఇది శ్రీభారద్వాజసగోత్రపవిత్ర వేదుల యజ్ఞేశ్వరతనూభవ సీతారామశాస్త్రివిరచితంబగు
భరతసంగ్రహమునందు
రాగాధ్యాయము
సంపూర్ణము.

---



# తాళప్రకరణము.

సీ. ఆనంద తాండవంబాడు సదాశివు
పాదంబునందిల బడినయందె
తకిటత ధరికిట దధిగిణ ఝును ఝొంత
యన యాదితాళంబు యనిరిదాని
కాలమార్గక్రియాంగ గ్రహప్రస్తార
యతి కళాలయ జాతుల నెడిపదియు
తాళంబులకు ప్రాణ తతులనంబుజపద్మ
పత్రశతంబందు బరచినూచి
గీ. ముఖత్రుటిత కాలమేలసంబునకు జెల్లు
నవియువసుగుణ్యమగుచును నగునుక్షణము
కాష్ట నిముష కళాభాగకములను ధృత
ధృతయులఘు గురుకాలమందెనయు సాంబా 92

తా॥ఆనందంబుతో ప్రదోషతాండవంబు జేయుచున్న యీశ్వరుని పాదంబునుంచి జారినేలపైబడిన యందె తకిటత ధరికిట దధిగిణ ఝుణు ఝొంత యని పదహారుశబ్దములుగా బలికెను నదియె కాక పాదంబయ్యెను నదియే తాళమునకు ఆదిగనుక దానిని ఆది తాళంబనిరి. దానికిదశప్రాణములు గలవు, నవియేవి యనిన 1 కాలము 2 మార్గము 3 క్రియ 4 అంగము 5 గ్రహము 6 ప్రస్తారము 7 యతి 8కళ 9 లయ 10 జాతి యీపదితాళమునకు దశప్రాణములు, అందు తామరరేకులు, నొకదానిపై నొకటి చొప్పున

నూరు బరచి, సూది మోనతో రంధ్రముగా చేయదగు కాలము లవమనంబడును. యెనిమిది లవములు 1 క్షణము-8-క్షణములు 1 కాష్ట 8 కాష్టలు 1 నిమిషము 8 నిమిషములు 1 కళ 8 కళలు 1 భాగము 8 భాగములు 1 అనుధృతము 2 అనుదృతములు 1 ధృతము 2 ధృతములు 1 లఘువు 2 లఘువులు 1 గురువు 2 గురువులు 1 కాకపాదము। యీప్రైనమె కాల మనంబడును॥ 92॥

సీ. మార్గముల్దక్షిణమన వార్తికముచిత్ర
చిత్రతరతి చిత్ర చిత్రతమము
లష్టకళాక్రియల నిరిదక్షిణమందు
నందరవార్తికంబందు నెప్పు
నలులపమార్గంబులకును నూహ్యంబగు
మార్గదేశియభేద మమరునుక్రియ
లఘుపంచకముచే చలగునుదేశియక్రియ
పదియుమార్గ క్రియం బరగుచుండు

గీ. వక్కటాడగ పదియారు వరకువరుస
నొక్కొకటి వృద్ధిగా బెంప నొప్పుచుండు
నంగభేదాదిసంఖ్యల నంజలంగి
పదియునారు గనంగముల్బరగుసాంబ 93

తా. తాళమునకు మార్గములు ఆరుగలవు యేనిమిదికలలు క్రియగా గలుగునది దక్షిణ మార్గము నాలుగుకలలు క్రియగాగలుగునది వార్తికమార్గము రెండుకలలుక్రియగాగలుగునది చిత్రమార్గము 1 కలక్రియగాగలుగునది చిత్రతరము అందుసగము అతిచిత్రము అందుసగము చిత్రతమము అనిచెప్పబడును క్రియ మార్గక్రియ యనియు దేశియక్రియయనియు రెండువిధములు అయిదులఘువు

లు మార్గక్రియకును పది లఘువులు దేశియక్రియకును గలుగును అందులంగములు 16 వకటిమొదలు పదహారువరకు వకటొకటి వృద్ధిగా షోడశాంగములగును వైనం 1 అనుధృత 2 ధృత 3 ధృతవిరామం 4 లఘువు 5 లఘువిరామం 6 లఘుధృత 7 లఘుధృతరామం 8 గురువు 9 గురువిరామం 10 గురుధృత 11 గురుధృతవిరామం 12 ప్లుతం 13 ప్లుతవిరామం 14 ప్లుతధృత 15 ప్లుతధృతవిరామం 16 కాకపాదం యివియెతాళమునకు అంగ సంజ్ఞలైయుండును 93

సీ. గ్రహము ముత్తెరగుల గ్రాలునుసమమతీ
తమునాహతంబన తగుగ్రమమున
తాళాంగసంఖ్యను తగుత్రిప్పైనుంచి
న్యూనాంగములమార్గ నుచితమగును
మానసంబునగల మానంబున్యూనాంగ
సమభిన్నమిలను బ్రస్తారమంద్య
పాతాళమనవట్టి పరిధవిల్లుచునుంసు
సర్వపాతాళంబు సకలమగును

గీ. లఘువుచతురస్రత్రిస్ర ఖండంబులనియు
మిశ్రసంకీర్ణముల నంగమెరయజాతి
అబ్ధిశిఖిశరశైలగ్రహాదికముల
సంఖ్యగానెంన్నుటలు జెల్లునతముసాంబా 94

తా. గ్రహము మూడువిధంబులు అవియెట్లన గీతతాళములు సమానముగా గ్రహించునపుడు ఆదిసమగ్రహము గీతముకన్న ముందు తాళముగ్రహించునపుడు అనాహతగ్రహము గీతముకన్న వెనుక తాళముగ్రహించునపుడు అతీతగ్రహముఅగును ప్రస్తారము తాళ

ముయొక్క అంగమును పైనుంచి దానికన్న తక్కువసంఖ్యగల అంగములుచేమార్చి నసమానముగా తెగుటప్రస్తారమగును అనగాదేన్ని ప్రస్తరింపవలయునో దాన్ని పైనుంచి దాని క్రింద దానికన్న తక్కువసంఖ్యనుంచి దానికికుడివైపున మొదటసంఖ్యకు సమానమగు అంగముల నుంచవలయును పునరుక్తులురాకుండునట్లు స్వరప్రస్తారమువలె సరిచూడవలయును, దృతంకింద ధృతమును అనుధృతముక్రింద అనుధృతమును వుంచవలయును॥

| | | |
|---|---|---|
| 1 అనుదృత | 3 ధృతవిరా | 4 లఘుప్రస్తారము |
| 2 ధృతప్రస్తారం | 1-2 మప్రస్తారం | 22 |
| 11 | 2-1 | 112 |
| | 111 | 121 |
| | | 211 |
| | | 1111 |

గురుప్రస్తారము

| | |
|---|---|
| 8 | 1 1 1 4 1 |
| 4 4 | 1 4 2 1 |
| 2 2 4 | 1 2 2 2 1 |
| 1 1 2 4 | 2 1 2 2 1 |
| 1 2 1 4 | 1 1 1 2 2 1 |
| 2 1 1 4 | 4 1 2 1 |
| 1 1 1 1 4 | 2 2 1 2 1 |
| 2 4 2 | 1 1 2 1 2 1 |
| 1 1 4 2 | 1 2 1 1 2 1 |
| 4 2 2 | 2 1 1 1 2 1 |
| 2 2 2 2 | 1 1 1 1 1 2 1 |

| | |
|---|---|
| 1 1 2 2 2 | 2 4 1 1 |
| 1 2 1 2 2 | 1 1 4 1 1 |
| 2 1 1 2 2 | 4 2 1 1 |
| 1 1 1 1 2 2 | 2 2 2 1 1 |
| 1 4 1 2 | 1 1 2 2 1 1 |
| 1 2 2 1 2 | 1 2 1 2 1 1 |
| 2 1 2 1 2 | 2 1 1 2 1 1 |
| 1 1 1 2 1 2 | 1 1 1 1 2 1 1 |
| 4 1 1 2 | 1 4 1 1 1 |
| 2 2 1 1 2 | 1 2 2 1 1 1 |
| 1 1 2 1 1 2 | 2 1 2 1 1 1 |
| 1 2 1 1 1 2 | 1 1 1 2 1 1 1 |
| 2 1 1 1 1 2 | 4 1 1 1 1 |
| 1 1 1 1 1 1 2 | 2 2 1 1 1 1 |
| 1 2 4 1 | 1 1 2 1 1 1 1 |
| 2 1 4 1 | 1 2 1 1 1 1 1 |
| 2 1 1 1 1 1 1 | 1 1 1 1 1 1 1 1 |

యీరీతిగాఅన్నియు నూహింపవలెను

యీక్రిందిమెరువులను జూచినసులభముగా బోధపడును

అందుచేర్పడు మొత్తమునకు పాతాళమనిపేరు అంగములమొత్తమునకు సర్వపాతాళంఅనియును పేరు లఘువుచతురస్రజాతియందు నాలుగు అనుధృతములు గలదిగాను త్రిస్రజాతియందు 3 అనుధృతములు గలదిగాను ఖండజాతియందు 5 అనుధృతములుగలదిగాను మిశ్రజాతి 7 అనుధృతములు గలదిగాను సంకీర్ణజాతి 9 అనుధృతములు గలదిగాను యెన్నవలయును 94

—* మేరువృద్ధారణం *—

సీ. శ్వేచ్ఛాగతంబుగా చెలగుతాళంబున
గలయనుధృతసంఖ్యగలుగునట్లు
పూర్వపశ్చమదిశల్పొందు రేఖలనుంచి
సందడ్డముగమరియన్ని జేర్చి
మూలాదినొకకోష్టమునుతగ్గుచునురాగ
సంత్యపర్యంతమానట్లునిలిపి
నాదికోష్టంబులసందొకట్లునునించి
క్రిందిపంక్తుల బేశిక్రియలయందు

గీ. సంత్యపాంత్యష్ట ద్వాదశమబ్దులరయ
వర్జమంత్యంబుసమకోష్టవరుసలందు
వహ్నివసుభానుకోష్టభావప్రనిధిగ
ననలమునిరుద్రసంఖ్యలుసగునుసాంబా 95

తా.తనయిష్టమగు తాళంబునందు యెన్ని అనుధృతము లుండునోన న్ని పూర్వాభి ముఖములగు రేఖను వ్రాసి మరియు నడ్డంబుగా నన్ని రేఖలును వ్రాయుచూ వాయవ్యం మూలమొదలుకొని నగ్ని మూలవరకు నొకొక్క-కోష్టమును తగ్గించుచూ సత్యమగుపర్యంతము వ్రాయవలయును వాటిపైనితాళాంగములు గుర్తులుగా వేయవలయును వాటిక్రిందిగళ్ళలో నొకటొకటిగా సంకెలు వేయవలెను అందుక్రిందిపంక్తి విషమకోష్టములయందు చివర రెండుగళ్ళు-8-4-12-గళ్ళువదిలి అంత్యాది సమగళ్ళయందు 3-8 12-గళ్ళకు ప్రతినిధిగా 3 7-11 చేర్చుకొనవలెను యీక్రిందిచక్రముచు జూచినస్పష్టమగును. యీప్రతినిధియను ధృతమేరువునందు మాత్రమేగలదు. ధృతాదిమేరువులయందు ప్రతినిధిమాత్రముయుండదు 95

చతురంగప్రస్తారపధకము

| ౦ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | అంకశ్రేఢి |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 6 | 10 | 19 | 33 | 60 | సంఖ్యా శ్రేఢి |
| 1 | 2 | 5 | 10 | 22 | 44 | 91 | 180 | పాతాళము |
| 1 | 3 | 7 | 16 | 34 | 72 | 147 | 298 | సర్వపాతాళం |

| అంకము | శ్రేఢి | ద్రు | ల | గు | పు | సర్వపాతాళము |
|---|---|---|---|---|---|---|
| ౦ | 1 | 1 | 0 | 0 | 0 | 1 |
| ౧ | 2 | 2 | 1 | 0 | 0 | 3 |
| ౨ | 3 | 5 | 2 | 0 | 0 | 7 |
| ౩ | 6 | 12 | 5 | 1 | 0 | 16 |
| ౪ | 10 | 22 | 10 | 2 | 0 | 34 |
| ౫ | 19 | 44 | 22 | 5 | 1 | 72 |
| ౬ | 33 | 91 | 44 | 10 | 2 | 147 |
| ౭ | 60 | 180 | 91 | 22 | 5 | 298 |

| | ᴗ | ౦ | ర | ౧ | ץ | ౨ | ర | ౩ | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | 1 | 8అ |
| | | | | | | | 1 | 0 | 7అ |
| | | | | | | 1 | 0 | 7 | 6అ |
| | | | | | 1 | 0 | 6 | 0 | 5అ |
| | | | | 1 | 0 | 5 | 0 | 20 | 4అ |
| | | | 1 | 0 | 4 | 0 | 14 | 0 | 3అ |
| | | 1 | 0 | 3 | 0 | 9 | 0 | 22 | 2అ |
| | 1 | 0 | 2 | 0 | 5 | 0 | 10 | 0 | 1అ |
| 1 | 0 | 1 | 0 | 2 | 0 | 3 | 0 | 6 | ఆహీనం |

సీ. చతురస్రజాదిగాజలగు జాతులయందు
ద్విగుణంబులై క్రియల్దెజరిల్లు
కళలనంబడుశీత కరరవియతునత
వరశాస్త్రిభాణాణ వాటి విదులు
తాళమధ్యంబునదవులు కాలములయ
యనిమధ్య ధృతవిలంబంబులందు
మయకాలమును శిద్ధమనగజలంగును
ధృతమర్ధమగునందు ద్విష్టదురము
గీ. దీర్ఘ మగుచు విలంబమైదేజరిల్లు
యతియునాద్యంత మయములయందునొప్పు
సమముస్రోతోవహము గోపుఛంబనంగ
తాళప్రాణంబు లిటుపదిదనరుసాంబా॥ 96

తా. చతురస్రజాతి మొదలు కోనిగ్రమముగావక దాకంటె నొకటికి క్రియలురెట్టింపుగాయుడును యెట్లన చతురస్రజాతికి 1 త్రిస్రజాతికి 2 ఖండజాతికి 4 మిస్రజాతికి 8 సంకీర్ణజాతికి 16 యిట్లగును వీటియందు కళలుగ్రమముగా 1, 12, 6. 9, 6, 5,4,2,1, యిట్లగును తాళమధ్యంబునందుండు కాలములయయనంబడును అందుస్వభావజన్యమగునది మధ్యమకాలమనంబడును దానికిరెట్టింపుగాదురయుసేయునది ధృతకాలమగును మొదటిదానికంటె దీర్ఘమగునది విలంబకాలమగును యతిమూడువిధంబులు 1సమయతి 2 స్రోతోవహాయతి 3 గోపుఛయతి తాళాంగములలో మొదట గొప్ప సంఖ్యయుండు నేనిసమయతి మయమునసున్న స్రోతోవహాయతి అంత్యంబుననున్న గోపుఛయతి యిట్లుదశప్రాణములు సభపూర్ణము॥ 96

